## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విదురామృతం

రచన
పరమహంస పరివ్రాజకాచార్య
'శ్రీ శ్రీ శ్రీ అనుభవానందస్వామి'
వారి శిష్యులు

**శ్రీ మాతాజీ త్యాగీశానందపురి**

# సమర్పణము



అనుభవస్వరూపులు పూజ్య
పరమహంస పరివ్రాజకాచార్య
(శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారి)

పాద పద్మములకు వినమ్ర పూరిత
నమస్కారములతో........




శ్రీ రాజాలక్ష్మి ఫౌండేషన్

మద్రాసు - 18

# కృతజ్ఞతాభివందనములు

చాలాకాలము నుండి నాకు ధర్మ ప్రబోధక మైన 'విదురనీతి' ని గురించి ఒక ధార్మిక ప్రబో ధాత్మక గ్రంధము ప్రచురించాలని కోరిక ఉండేది.

నా యీ ఆశయాన్ని పూజ్య శ్రీ మాతాజీ వారికి నివేదించటం జరిగింది. శ్రీ మాతాజీ వారు నాయందు ఉండే అభిమానముతో స్వల్ప వ్యవధిలోనే యీ గ్రంధము వ్రాసి ఇచ్చారు. ప్రేమ స్వరూపుణి అయిన శ్రీ మాతాజీ వారికి నా సహస్ర కృతజ్ఞతాభి వందనములు.

ఈ గ్రంధాన్నికి అందముగా ముఖచిత్రము వ్రాసి ఇచ్చిన 'శ్రీ బాపుగారికి'

అందముగా టైప్ సెట్టింగ్ చేసి ఇచ్చిన రియల్ టైమ్ కంప్యూటర్స్ వారికి.

అతి త్వరగా ఎంతో చక్కగా ముద్రించిన స్వా ప్రింటిగ్ ప్రెస్, విశాఖపట్నం వారికి

ఈ గ్రంథ ముద్రణమునకు కృషి సల్పిన శ్రీ సుధా చైతన్య గారికి మరియు మా పుస్తకములను ప్రచురించుటలో యెల్లప్పుడు విలువైన సలహాలను అందచేసే మా శ్రేయాభిలాషులకు కృతజ్ఞతాభి వందనములు.

'రాజా'

# పరిచయము

శ్రీమాతాజీ త్యాగీశానందులవారు 1934 వ సం.లో శ్రీ వివేకానందస్వామి జన్మించిన పుష్య బహుళ సప్తమీ శుభదినం విజయనగరంలో జన్మించారు. తల్లిదండ్రులు శ్రీమతి లక్ష్మీగున్నమ్మ, నీలకంఠశాస్త్రి. శ్రీ శాస్త్రిగారు శ్రీబాలాత్రిపురసుందరి ఉపాసకులు, సంగీతవిద్వాంసులు, జ్యోతిశ్శాస్త్రవిశారదులు. సన్యాసం స్వీకరించి శ్రీనీలకంఠస్వాములవారుగా సుప్రసిద్ధులు.

శ్రీమాతాజీవారికి తమ 12 వ సంవత్సరమున భీమునిపట్నం శ్రీరామ కృష్ణాశ్రమంలో, అనుభవస్వరూపులు, సర్వ కళా మూర్తులు, తపోసంపన్నులు, సర్వ శాస్త్రవిశారదులు, శ్రీరామకృష్ణ పరమహంస అను యాయులైన శ్రీఅనుభవానందస్వామివారి సందర్శనభాగ్యం కలిగింది. శ్రీస్వామీజీవారి పరి చయముతో, శ్రీమాతాజీవారిలో ఆధ్యాత్మిక చైతన్యం వికసించి 'సాధనంటే ఏమిటి? భగవత్ సాక్షాత్కారమును పొందుటకు ఎలా సాధన చేయాలి?' అని ప్రశ్నించి, సాధనవిషయాలను లేఖలుగా 'సాధన రహస్యము'(The Secret of Yoga Sadhana) పేరుతో వ్రాయించుకున్న ధన్యులు శ్రీమాతాజీవారు. ఈ అపూర్వగ్రంథం నేటికి తెలుగులో 11 ముద్రణముల పొంది, సుప్రఖ్యాతమై కొన్ని భారతీయభాషలలో ప్రచురింపబడినది. మరియు

అనేక దేశవిదేశ భాషలలోనికి అనువదింపబడి, ప్రచురింపబడనున్నది.

శ్రీమాతాజీవారు 1947లో శ్రీస్వామి వారి సన్నిధినిచేరి, బ్రహ్మచారిణి యై, శ్రీ స్వామివారివద్ద అంతేవాసిగా ఉండి, సాధనా విద్యాభ్యాసముల కొనసాగించి, 1954 శ్రీ శారదాదేవి శతవార్షికోత్సవ శుభసందర్భమున తమ గురువర్యులనుండి కలకత్తాలో యత్యాశ్రమం స్వీకరించిన సమయంలో 'త్యాగీశానందపురి' అని నూతన నామధేయాన్ని పొందారు.

బహుముఖ ప్రజ్ఞాశాలియైన శ్రీ మాతాజీ వారు చక్కగా సంకీర్తన చేస్తారు. సుప్రసిద్ధ వక్తలు. వేద, ఉపనిషత్, మంత్ర, తంత్ర శాస్త్రములలో విశేష కృషి చేసి అనేక సుప్రసిద్ధ గ్రంథాలను వ్రాశారు. వక్తృత్వంలో ఒక విశిష్టత్వాన్ని ఆర్జించి, శ్రీస్వామివారితో కలిసి మనదేశంలో అనేకవేల ధార్మికోపన్యాసములు చేశారు.

1973 లో తమ గురువర్యుల మహా సమాధ్యనంతరం, శ్రీమాతాజీవారు, శ్రీస్వామివారిచే స్థాపింపబడిన ప్రశాంత ఆధ్యాత్మిక వాతావరణ ములతో సలరారుచున్న భీమునిపట్నం (విశాఖ జిల్లా), బాపట్ల (గుంటూరు జిల్లా)లోని శ్రీరామకృష్ణ ఆశ్రమద్వయాన్ని నిర్వహిస్తూ, శ్రీ అనుభవానంద గ్రంథమాల (బాపట్ల), స్వామి అనుభవానంద యోగకేంద్ర (భీమునిపట్నం), ద్వారా వివిధ

భాషలలో, అనేక గ్రంథాలను మరియు భక్తిప్రబోధక స్టీరియో కేసెట్లను ప్రచురిస్తూ, ఆశ్రమముల, గ్రంథముల, ఉపన్యాసములద్వారా సమాజ కళ్యాణమునకై విశేష కృషి చేస్తున్నారు. శ్రీ మాతాజీవారు ప్రస్తుతము అఖిలాంధ్ర సాధు పరిషత్‌కు అధ్యక్షులుగా ఉంటూ, తమ అనర్గళ ఉపన్యాసములతో ఆబాలగోపాలమును ఆధ్యాత్మికంగా ప్రభావితం గావిస్తున్నారు.

సుధాచైతన్య.

## మనవి

శ్రీమాతాజీ వారికి నాయందు వాత్సల్యం ఏర్పడడం, అది నాపూర్వజన్మసుకృతం.

'అమ్మ' అనేది పేరయితే అది వారికి చెల్లుతుంది. అది పిలుపైతే నేను వారిని 'అమ్మా' అని పూజ్యభావంతో, ప్రేమతో పిలుస్తాను.. ఎన్నో సంవత్సరాలుగా ఎందరో "విదురనీతిని" గురించి ప్రాసంగికంగా చెప్పడం విన్న న్నాలో ఇది అమ్మచేత వ్రాయించా లని కోరిక కలిగింది. శ్రీ మాతాజీకి నాకోరిక నివేదించేను. వారు అంగీకా రానికి రూపమే ఈ గ్రంథం. వారికి మరొకసారి శిరసా నమస్కరించుతూ కృతజ్ఞతలు తెలుపు తున్నాను. నాయీ కోరిక నీతిచింతన గలవారికైనా రుచిస్తే అదే నాకు ఫలశ్రుతి.

రాజా

## ధర్మనిష్ఠుల శాంతిచంద్రికలలో....

'అమ్మా! 'విదురనీతి' చాలా బాగుం టుంది. దాన్ని మీరు నాకు వ్రాసి యివ్వండి' అంటూ చాలాకాలం క్రిందటే ఒకసారి మద్రాసులో అడిగాడు నన్ను చి॥ రాజా. 'చూద్దాంలే నాయనా' అన్నాను. మరల అప్పుడప్పుడు అడుగుతూనే ఉన్నాడు. మొత్తం 'విదురనీతి'ని వ్రాయాలంటే అనేక కార్యక్రమాలలో మునిగి ఉన్న నాకు కష్టమే అనకతప్పదు. అనేకమంది 'విదురనీతి' ని పూర్తిగా వ్రాసి ఉంటారు. నేనుమాత్రం 'విదురనీతి' యందలి కొన్ని విషయాలనుమాత్రమే తీసుకొని వ్రాశాను. అదే మన 'విదురామృతం'.

మానవుడు నిత్యం 'అసతో మా సద్గమయ! తమసో మా జ్యోతిర్గమయ! మృత్యోర్మా అమృతం గమయ!' అని భగవానుని ప్రార్థిస్తాడు. ఆప్రార్థనలో మానవునికిగల అసత్తు, తమస్సు, మృత్యువు అను మూడు అవలక్షణాలు కని పిస్తున్నవి. అసత్తు అనగా అనిత్యం, తమస్సు అనగా అజ్ఞానం, మృత్యువు అనగా మరణం అని అర్థం. అదేవిధంగా భగవంతునికికూడా సత్తు, జ్యోతి, అమృతం అనే గుణములు మూడు ఉన్నవి. సత్తు అనగా నిత్యం, జ్యోతి అనగా జ్ఞానం, అమృతం అనగా మరణరాహిత్యం. మానవుడు సాధనద్వారా అనిత్యమైన ప్రాపంచిక భావాలను పరిత్యజించి, 'జీవుడను' అనే అజ్ఞానాన్ని పారద్రోలి, 'మృత్యురహిత అమృతస్వరూపుడను'

అను సిద్ధస్థితినందుకుని ఆనందించటమే యీ ప్రార్థనా ఫలితం.

ఇది ఎటువంటివానికి సిద్ధిస్తుంది? ధర్మ తత్పరులకు. ధర్మంతో మానవజీవితం ప్రారంభమై, ధర్మంలోనే జీవించి, ధర్మంతో నిండి, పండి, ధర్మంతో పూర్తికావాలి. అట్టివారు పుణ్యపురుషులు. అందుచేతనే 'ధర్మమూలమిదం జగత్' అన్నారు. ధర్మంవినా మానవునికి శాంతి చేకూరదు. మత, ధర్మాలకు చాలా భేదం ఉన్నది. మతం దేశ కాలానుగుణ్యంగా మారుతుంటుంది. కాని ధర్మమో సర్వదేశ, సర్వకాల, సర్వావస్థల సుస్థిరంగా ఉంటుంది. కావున ధర్మాన్ని పునాదిగా గలిగిన మతాలు శాశ్వతంగా ఉంటాయి. మిగిలినవన్నీ తాత్కాలిక ఆకర్షణలతో, ప్రజల నాకర్షించుకుం టాయి. మతాలు మనుషులను చేర్చుకుంటాయి. అందుచేత వానినుండి బయటికి రావచ్చును యిష్టం లేకపోతే. కాని మనుషులు ధర్మాన్ని ఆచరిస్తారు. అందుచేత వారు ధర్మాన్ని విడువలేరు.

ఈ ధర్మాచరణ, ధర్మప్రబోధాలు ఎవరికి? అనేది మొదటి ప్రశ్న. పశుపక్ష్యాదులకు బోధిం చవలసిన అవసరమేలేదు. యజమానిని చూచిన కుక్కకు తోక నాడించమని ఎవరుపదేశించారు? నల్లని మబ్బును చూచిన మయూరానికి పింఛం విప్పి నృత్యం చేయమని ఎవరు ఆదేశించారు? తల్లిని చూడగానే ఆనందంగా గంతులేసే ఆవుదూడకు, తల్లివద్ద పాలు త్రాగమని ఎవరు

తెలియచేశారు? ఆకాశంలో ఎగురుతున్న గ్రద్దను చూచిన కోడికి, పిల్లలను రెక్కలచాటున దాచుకో మని ఎవరు చెప్పారు? అవి వాటికి సహజం.

ఇక మిగిలినవారు మనుష్యులు. భగవంతుడు మానవులకు విచక్షణాజ్ఞానంతో కూడిన మనస్సును, తన భావాలను వ్యక్తం చేయటానికి వాక్కును ప్రసాదించి, వాటిని సద్వినియోగం చేసికోమన్నాడు. ఆరెండింటిని దుర్వినియోగం చేసికొన్నప్పుడే నీతిశాస్త్రాలు, ధర్మోపదేశాలు అవసరం అవుతాయి. కావున బుద్ధి, జ్ఞానం గల మానవులే చెప్పించుకొనే స్థితిలో ఉన్నారని అర్థం. ధర్మాధర్మవిచక్షణాజ్ఞానరహితులకే ధర్మశాస్త్రాలు. నీతినియమాలకు కట్టుబడనివారికే నీతిశాస్త్రాలు. అట్టివాడే ధృతరాష్ట్రుడు.

ఎవరు ఉపదేశించాలి? అనేది రెండవ ప్రశ్న. ధర్మగ్రాహియై, ధర్మసూక్ష్మముల గ్రహించి, ధర్మశీలియై, ధర్మాచరణ గావించి, పొరపాటునగూడ అధర్మాచరణ చేయనివాడు ధర్మోపదేశం చేయగల యోగ్యుడు. లోకశ్రేయస్కామియే ఉపదేశకుడు. ధర్మాత్ములను రక్షణ చేయువాడు ప్రబోధకుడు. కౌరవుల కుతంత్రాలను ముందుగానే గుర్తించి, లాక్షాగృహంనుండి పాండవులను శ్రీకృష్ణునికి పూర్వమే మొదట కాపాడి, ఆ ధర్మాత్ములకు ప్రాణభిక్ష బెట్టి రక్షణ గావించినవాడు ప్రాజ్ఞుడైన విదురుడే! అంతేకాక కుంతి -పాండుపుత్రులు వారణావతమున లక్క ఇంటిలో మరణించలేదను

విషయము ఒక్క విదురునికిమాత్రమే తెలును.

మనకు మహాభారతంలో ముగ్గురు దుఃఖితులు గోచరిస్తారు. ఒకడు ధృతరాష్ట్రుడు. తాను, తనవారు చేస్తున్నది అధర్మం అని తెలిసికూడా, దానినుండి బయటపడే శక్తిలేక అజ్ఞానిగా నున్నవాడు ధృతరాష్ట్రుడు. ఆదర్శ గృహస్థుగా నుండి, భగవద్భక్తియుతుడై, వినయమూర్తియై, ఎప్పటికప్పుడు ధృతరాష్ట్రుని దుర్గుణముల తెలుపుతూ, ధృతరాష్ట్రునికి నీతిని ప్రబోధించాడు ప్రాజ్ఞుడైన విదురుడు. కాని ఆ సూక్తిముక్తావళిని, అందుకొని, ఆచరించలేక దుఃఖంలోనే శాశ్వతంగా క్రుంగిపోయాడు ధృతరాష్ట్రుడు.

రెండవవాడు అర్జునుడు. అర్జునుడు మహావీరుడై, ద్రోణాచార్యుని ప్రియశిష్యుడై, శస్త్రాస్త్రవిద్యలలో నిపుణుడై, శ్రీకృష్ణునికి ప్రియ స్నేహితుడై, పాశుపతాస్త్ర సంపాదనకు ఈశ్వరుని గూర్చి తపస్సు గావించినవాడు. అట్టి అర్జునుడు, కురుక్షేత్రరణరంగం మధ్యలో నిలిచి, కురువృదులను, గురువులను చూచి, దుఃఖాక్రాంతుడై, యుద్ధము చేయనని తన సారథియైన శ్రీ కృష్ణపరమాత్మను ఆశ్రయించాడు. అప్పుడు యుద్ధవిముఖుడైన అర్జునునికి అనేక విషయముల 'భగవద్గీత' రూపమున ప్రబోధించి, మరల అర్జునుని యుద్ధోన్ముఖుని గావించాడు శ్రీకృష్ణుడు. అందువలన అర్జునుని దుఃఖం ఉపశమించింది. కురుక్షేత్రయుద్ధం ప్రారంభమైంది.

ఇక మూడవవాడు ధర్మరాజు. శాంత మూర్తియై, ధర్మావతారమై, మాతృభక్తితత్పరుడై, స్నేహశీలియై, యింద్రియనిగ్రహుడై, అజాతశత్రువుగా పేరు పొందినవాడు యుధిష్ఠిరుడు. యుద్ధరంగమున ప్రవేశించినవెంటనే రథం దిగి, భీష్మద్రోణాదుల చేరి, పాదాభివందనమాచరించి, 'విజయోస్తు' అని - అధర్మ పక్షమున యుద్ధ సన్నద్ధులై యున్నవారి ఆశీర్వచనముల నందుకున్న సౌమ్యశీలి, భాగ్యశాలి ధర్మనందనుడు. ధర్మయుద్ధమే అయినా తనవారందరి మరణానికి తానే కారణమని దుఃఖించి, అశాంతితో నున్న ధర్మరాజుకు, ధర్మబోధ గావించినవాడు ఆజన్మబ్రహ్మచారియు, జితేంద్రియుడునైన భీష్మా చార్యుడు. ఆ ప్రబోధంతో దుఃఖనివారణ కలిగి, శాంతమనస్కుడై, ధర్మబద్ధుడై, ప్రజారంజకంగా ఆదర్శరాజ్యపరిపాలన చేసినవాడు ధర్మరాజు.

ధర్మానికి దుఃఖనివారణయే గమ్యం. ధర్మాచరణ చేయగలవారు మానవులే. కాన యీ మన 'విదురామృతం' లోని మాధుర్యాన్ని గ్రోలి, ధర్మాచరణకు పూనుకుందురుగాక! మానవప్రగతికి, దేశప్రగతికి ధర్మమే శరణ్యం. అందుచేతనే 'ధర్మం శరణం గచ్ఛామి' అన్నాడు అహింసావతార మూర్తియైన బుద్ధభగవానుడు.

1990 లో శ్రీరాజా - లక్ష్మి ఫౌండేషన్ వారు భగవతి అనుగ్రహమున నాచే రచితమైన, శాక్తేయసాధనా వైశిష్ట్యాన్ని, ప్రాముఖ్యతను ప్రబోధించే 'శ్రీమాత' అను గ్రంథాన్ని సర్వాంగ

సుందరంగా ముద్రించి, అందరికి ఉచితంగా యిచ్చి, చదువరులకు ఆనందాన్ని కలిగించారు. నేడు ఆ 'శ్రీమాత' గ్రంథము, సంస్కృత, ఆంగ్ల (The Divine Mother), హిందీ, తమిళ, కన్నడ, ఒరియా భాషలలోనికి అనువదింపబడి, మా 'స్వామి అనుభవానంద యోగకేంద్ర' ద్వారా ముద్రితమై, ముముక్షువులకు ఉచితముగా అందింపబడుచున్నది. మరికొన్ని యితర భాషలలోనికికూడా అనువాదము చేయబడి, ప్రచురింప బడనున్నదని తెలుపుటకు ఆనందిస్తున్నాను.

చి॥ రాజా-లక్ష్మీదంపతులు నాకు చిరకాలపరిచితులు. నాలుగు దశాబ్దాలకుపైగా కలిగిన పరిచయం యిది. మా గురువర్యులు, పూజ్యశ్రీ అనుభవానందస్వామివారి దివ్యాశీస్సుల నందుకున్న భాగ్యశీలురు యీ పుణ్యదంపతులు. వీరు, వీరి సంతానముకూడా యీ విధమైన ధార్మిక కార్యక్రమాలను నిర్వహిస్తూ, ధన్యులు కావాలని, భగవానుడు వీరికి శాంత్యానందముల నను గ్రహించాలని మనసారా కాంక్షిస్తూ, నా హృదయ పూర్వక ప్రేమాశీస్సులనుకూడా అందిస్తున్నాను.

4.11.93. మాతాజీ త్యాగీశానంద

శ్రీ అనుభవానందస్వామి జయంతి
శ్రీముఖ. ఆశ్వయుజ బహుళ పంచమి

ఓం శ్రీ శారదా రామకృష్ణాభ్యాం నమః

# వి దు రా మృ త ము

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః।

న యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

భగవద్గీత (3-21)

'దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహహైతుకమ్। మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః॥' మానుషత్వ ముముక్షుత్వ మహాపురుష సంశ్రయములను నీ మూడును భగవదనుగ్రహంవినా దుర్లభమనియు, అందునా 'జంతూనాం నరజన్మ దుర్లభం' జంతువులలో మానవజన్మ కలగటం దుర్లభమని 'వివేకచూడామణి' గ్రంథంలో శ్రీ శంకరుల దివ్యవాణి. పశువు, మానవుడుకూడా మావిలోనుండి జన్మిస్తారు. అందుచేతనే మానవుడిని పశులక్షణాలు వదలవేమో! ఆహారాన్ని ప్రధానంగా భావించటం పశులక్షణం. మనస్సుతో ఆలోచించి, మనస్సుకు విచక్షణాజ్ఞానాన్ని కలిగించటం మానవలక్షణం. మనస్సును వికసింపజేసికొనటం పండితలక్షణం. మనోనిగ్రహం సాధకలక్షణం. మనోహృదయ సమ్మేళనం మహాపురుషలక్షణం. అనగా కేవల యింద్రియ భోగలాలసత్వం పశుత్వం అనవచ్చును. ఇంద్రియములు + మనస్సు = మానవుడై, మనస్సు + విద్య = పండితుడై, ఇంద్రియములు + మనస్సు + నిగ్రహం

= సాధకుడై, మనస్సు + హృదయం = మహాత్ముడై పరిణామం పొందాలి. ఈ పక్వదశ మనిషికి సిద్ధించాలంటే ధర్మప్రసంగాలుకాక ధర్మాచరణ ముఖ్యాతిముఖ్యం అనకతప్పదు. నేటి ప్రపంచంలో ధర్మధర్మవిచక్షణాజ్ఞానం ఉన్నదికాని ఆచరణయే శూన్యమై, మనిషి, మనీ + షి = మనిషిగా మారి, కామినీ- కాంచనములకై అనగా అర్థకామములకై తపించి, ఎటువంటి దుష్కార్యాన్నైనా చేయటానికి వెనుదీయటం లేదుకదా! మహాత్ములు ఏ గుణాలను దూరం చేయమన్నారో ఆ దుర్గుణాలే ప్రస్తుత ప్రపంచంలో విస్తృతంగా విహారం చేస్తున్నాయి. నీటి కాలుష్యం, వాయుకాలుష్యం, ఆహారకాలుష్యం శరీరాన్నిమాత్రమే బాధిస్తున్నవి. ఆ బాధానివారణకు ప్రకృతి దోహదం చేస్తుంటే వైద్యులు ఔషధాలను యిస్తున్నారు. కాని సర్వ ప్రపంచాన్ని, ప్రజానందోహాన్ని సర్వనాశనం కావించు కాలుష్యం మరొకటున్నది. అదే మనోకాలుష్యం. ఈ మనోకాలుష్యం నశించటానికి యీ వైద్యులు ఉపకరించరు. మనస్సుకు అంతర్ముఖత్వం, అంతర్దృష్టి ఏర్పడాలి. ఇవి లభ్యం కావాలంటే సహాయభూతులు మన ప్రాచీన మహర్షివర్యులు. 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'। మనస్సే బంధమోక్షములకు కారణం అని గదా శ్రుతివాక్యం! ఆ మనస్సే కల్మషాన్ని దూరం చేసుకుంటే వ్యక్తికి శాంతి, ఆ వ్యక్తి కుటుంబానికి శాంతి, అటువంటి వ్యక్తులతో నిండిన సంఘానికి శాంతి, ఆ సంఘబాహుళ్యంవల్ల దేశశాంతి, లోక శాంతి. ఇవన్నీ

ఒక క్రమంలో ఒకదానిపై నొకటి ఆధారమని చెప్పకతప్పదు. ఈ విధమైన లోకశాంతికి కారణభూతులైన యీ మనుష్యుల అధర్మప్రవర్తన వల్లనేకదా అతివృష్టి అనావృష్టులు, భూకంపాలు, మారణహోమాలు విజృంభిస్తున్నవి! తపోసంప న్నులైన మహానుభావుల దివ్య భావసంపదలచే, దివ్యసంకల్పములచే సత్సంస్కారవంతులు శోభి స్తారు. అనుభవజ్ఞానసంపదల నిమగ్నులైన గురు పుంగవులచే సచ్ఛిష్యులు ప్రకాశిస్తారు. పవిత్ర మనో హృదయ సమ్మేళనం, శాస్త్రజ్ఞాన అనుభవజ్ఞానముల పొందిన యతిసార్వభౌముల ప్రచారంచేత విద్యావి వేక విరాగ విజ్ఞానముల పొందిన బ్రహ్మచారులు మన విశాల భారతీయ సంస్కృతికి వారసులుగా రాణిస్తారు. పరమపూజ్యులైన ఋషిసత్తముల ఆజ్ఞల శిరసావహించి, ధర్మబద్ధులై, ధర్మపోషకులై, ధర్మ రక్షకులై, ధర్మాధర్మవిచారణ గావించి, ధర్మయుతులై, దేశాన్ని పరిపాలించటానికి మహారాజులను చక్కగా తయారుచేసినవారు మన మునివరేణ్యులేగదా! జ్ఞాన మూర్తులకు అగ్రాసనము నిచ్చి, పూజ్యులను పూజించి, పెద్దలను గౌరవించి, పండితుల సత్కరించి, ఆర్ష సంస్కృతిని పోషించి, సంగీతసాహిత్యాది సకల కళల నాదరించి, ప్రజల ప్రేమించి, తోడునీడగా వ్యవహరించు మంత్రివర్యులకు ఉచితాసనమిచ్చిన మహారాజాధిరాజులచే పాలింపబడిన దేశం మన భారతదేశం. శాంతిభిక్షను ప్రసాదించినది మన భారతదేశం. ధర్మదండాన్ని చేత ధరించి, ఆధ్యాత్మిక

గురుస్థానాన్ని అధిరోహించింది మన భారతదేశం. A World of thinkers, a creation of Philosophers ధీమంతుల లోకము, తత్త్వవేత్తల కర్మాగారము అని మాక్సుముల్లర్ (Maxmuller) చే కీర్తింపబడినది మన భారతదేశం. నేడు అవన్నీ ఏమైనవో! మనకు సంప్రదాయం ఉన్నదే! అజరామరమైన పారమార్థిక సంపద ఉన్నదే! ఆధ్యాత్మిక జ్ఞానంతో పండిపోయిన మహనీయులున్నారే! భౌతికాభౌతిక విజ్ఞానసంపదల నార్జించిన అవధూతావతంసులున్నారే! దేనికీ ఎవరినీ ప్రాధేయ పడవలసిన అవసరంకూడలేదే! 'అహింసా పరమోధర్మః' అను సూక్తిని పూర్తిగా పాటించి, అహింసావతారమని ప్రఖ్యాతి గడించి, దేశదేశముల అహింసా ప్రచారము గావించి, అహింసాజ్యోతిని వెలిగించినవాడు శ్రీ బుద్ధభగవానుడేగదా! మరియు 'జ్ఞానేన మోక్షః' అని ప్రబోధించి, భాష్యత్రయాన్ని రచించి, పీఠచతుష్టయాన్ని స్థాపించి, సన్న్యాసపద్ధతుల వివరించి, భారతదేశమంతట పర్యటించి, అద్వైత సంస్థాపకుడుగా పేరొందినవాడు శ్రీ శంకరాచార్యులేగదా! విష్ణుభక్తివిశిష్టతను చాటి, 'మోక్ష కారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అను రీతి భక్తిప్రాముఖ్యాన్ని భక్తిరహస్యాలను తెలిపి, జన్మజన్మలనుండి ప్రాపంచిక విషయవాసనలతో గడ్డకట్టుకున్న మానవ హృదయక్షేత్రాలపై భక్తివర్షాన్ని కురిపించి, వారి హృదయాలను మెత్తగా తయారుగావించి, భక్తివంటను పుష్కలంగా పండించినవాడు శ్రీ రామానుజాచార్యులేగదా! మరియు

'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అను వేదసూక్తిని ఆచరించి, 'నామ భేదమేగాని భగవంతుడొక్కడే' అని అనుభవపూర్వకంగా పలికి, నిజజీవితంలో సర్వమతసమన్వయాన్ని ప్రబోధించినవాడు శ్రీ రామకృష్ణ పరమహంసయేగదా! అట్టి గురుసన్నిధిని సకల సాధనల గావించి, గుర్వనుగ్రహంతో నిర్వి కల్పసమాధ్యనుభూతి నార్జించి, ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానములతో విరాజిల్లి, పరివ్రాజకుడై, ఖండ ఖండాంతరముల మన భారతీయవిజ్ఞానవిశిష్టతను ఎల్గెత్తిచాటి, భారతదేశ కీర్తిప్రతిష్ఠల నత్యున్నత స్థానమున నిలిపి, వేదాంత ధ్వజాన్ని ప్రతిష్ఠించిన ధీరగంభీరమూర్తి శ్రీ వివేకానందస్వామియేగదా! ఇటువంటి పరమ పావనమూర్తులచే పునీతమైన భారతదేశము నేడు అల్లకల్లోలములకు ఆల వాలమైనది.

మనువుచే 'మనుధర్మశాస్త్రం' లిఖించబడ్డది. యుద్ధవిముఖుడైన అర్జునునికోసం శ్రీకృష్ణపరమాత్మ చే బోధింపబడ్డది 'భగవద్గీత'. మరణోన్ముఖుడైన పరీక్షిన్మహారాజుకొరకు త్యాగమూర్తియైన శ్రీశుకమహర్షిచే ఉపదేశింపబడినది 'భాగవతం' అదేవిధంగా, పుట్టుగ్రుడ్డియై, రాజ్యకాంక్షాయుతుడై, అహంకారమమకార తమోగుణములకు బానిసయై, ధర్మాన్ని తెలిసియు అధర్మప్రవర్తకుడైన ధృత రాష్ట్రునికోసం మహిమాన్వితుడును, నిగర్వి అయిన విదురునిచే వచింపబడినది 'విదురనీతి'. శ్రీకృష్ణ భగవానుని ప్రబోధానంతరం యుద్ధం చేసి, లౌకికంగా విజయాన్ని పొందాడు అర్జునుడు. శ్రీశుకమహర్షి

ఉపదేశానంతరం ప్రశాంత మనస్కుడై, భయ రహితుడై, భగవంతుని అనుగ్రహాన్ని పొందాడు పరీక్షిత్తు. విదురుని ఉపదేశాలను ఆలకించిన పిమ్మట, ధృతరాష్ట్రునికిమాత్రం దుఃఖం దూరం కాలేదు. కారణం, ఆయన శ్రవణం, వినటంతోనే నిలిచిపోయింది. ఆచరణలో పెట్టుకోలేకపోయాడు. శ్రవణంవల్లనే అవలక్షణాలు నశిస్తాయనుకుంటే నేడు అనేకులద్వారా అనేకమంది, శ్రవణం చేస్తూనే ఉన్నారుగదా!

ఇక్కడ వక్త, శ్రోతల సంబంధం చాలా ముఖ్యం. యోగ్యుడైన వక్త, యోగ్యుడైన శ్రోత అని యిక్కడ అర్థం. 'శ్రోతరి జ్ఞాతరి ప్రాప్తే శ్లోకః సుశ్లోకమాప్నుయాత్' యోగ్యుడైన శ్రోత ప్రాప్తిస్తే యోగ్యుడైన వక్తయొక్క కీర్తిచంద్రికలు దిగంతముల వ్యాపిస్తాయను సూక్తి పరమసత్యం. దీనికి ఉదాహరణ శ్రీ శుకమునీంద్రుడు, పరీక్షి న్మహారాజులే. త్యాగియై, సదా బ్రహ్మజ్ఞాననిరతుడై, దిగంబరియై, స్త్రీ పురుష తారతమ్యాన్ని మరచిన మహాయోగి శ్రేష్ఠుడైన శ్రీశుకమునివర్యుడు మహావక్త కాగా, పాండవవంశప్రదీపకుడై, ధర్మపరిపాలకుడై, ధర్మనిరతుడై, క్షణికోద్రేకపూరితుడై, 'వారము రోజులలో నీకు మరణం ప్రాప్తిస్తుంది' అనే శాపాన్ని పొంది, భయాన్ని పొంది, 'ఈ ఏడు దినములలో నాకు భగవత్తత్వాన్ని తెలియజేసి, ముక్తిని అనుగ్రహించే వారెవరా' అని ఆవేదనతో తపిస్తున్న పరీక్షిన్నరేంద్రుడు మహాశ్రోత అయ్యాడు. వక్త, బ్రహ్మజ్ఞానసంపన్నుడు, శ్రోత, తీవ్ర ముము

క్షువు. వక్త, శోకరహితుడు, శ్రోత, శోకసహితుడు. వక్త, మహాత్యాగి, శ్రోత, మహావిరాగి. వక్త, మృత్యుభయంలేనివాడు, శ్రోత, మృత్యుభయంతో అలమటిస్తున్నవాడు. సరియైన శ్రోత, అయిన పరిక్షిత్తు శ్రీ శుకమహర్షిద్వారా శ్రవణం చేసి, ధన్యతను గావించుకున్నాడు జీవితాన్ని. ఈ యిరువురి పుణ్యాత్ముల సమ్మేళనంవల్ల భక్తి రసభరితమైన భాగవతగ్రంథం బహిర్గతమైనది. అందుచేతనే ఆ గ్రంథరాజం 'భాగవతసప్తాహం' పేరుతో నాటినుండి నేటివరకు అనేక సప్తాహాలను చేయించుకుంటున్నది.

మరొక వక్త, శ్రోతల సంబంధమున్నది. యోగ్యుడైన వక్త, అయోగ్యుడైన శ్రోత అని అర్థం. 'శ్రోతర్యజ్ఞాతరి ప్రాప్తే లకారస్తత్ర లుప్యతే|' అనర్హుడైన శ్రోత లభిస్తే 'శ్లోక' అను పదములోని మొదటి అక్షరమైన 'శ్లో' అనుదానిలో క్రిందనున్న 'ల' అను అక్షరం లోపిస్తుంది. అనగా శోకం మిగులుతుందని అన్వయం. ఎవరికి దుఃఖం మిగులుతుంది? వక్తకు కాదు, శ్రోతకు. దీనికి ఉదాహరణ - విదుర ధృతరాష్ట్రులు. ధృత రాష్ట్రునిచేతనే 'మహాప్రాజ్ఞం దీర్ఘదర్శినం' (వి.నీ. 1.5) అనియు, 'ధర్మార్థకుశలః' (వి.నీ. 2.1) అనియు, స్తుతింపబడినవాడు విదురుడు. విదురుని జన్మ విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అనం దాన్ని యిస్తుంది.

మహాభారతం కథలు అందరికి తెలిసినవే. కాశీరాజు పుత్రికా త్రయంలో యిరువురుమాత్రం

భీష్ముని తమ్ముడైన విచిత్రవీర్యునికి భార్యలయ్యారు. కాని దురదృష్టవశాత్తు విచిత్రవీర్యుడు అకాలమరణం పొందాడు. అంబిక, అంబాలికలకు సంతానం లేదు. శంతనమహారాజు పత్నియైన సత్యవతి, శ్రీవ్యాస భగవానుని స్మరించింది. వెంటనే కాషాయాంబరధారియైన శ్రీ వ్యాసమహర్షి ప్రత్యక్షమై, వందనం చేసి, 'అమ్మా! ఏమి యాజ్ఞ?' అన్నాడు. ఆ తల్లి పరిస్థితినంతా వివరించింది. కురువంశం వర్ధిల్లాలని పలికింది. మాతృమూర్తి ఆవేదనను గ్రహించాడు ఆ మునివర్యుడు. ఆ వంశానికి సంతానాన్ని అనుగ్రహించాలనుకున్నాడు. 'అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః। అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః॥' నాలుగు ముఖములు లేని బ్రహ్మయై, పాణిద్వయముగల అపర విష్ణువై, ఫాలమున నేత్రములేని ఈశ్వరుడై అలరారిన ఆ బాదరాయణుడు మహాశక్తిసంపన్నుడగుటచే, అంబికా అంబాలికలను పిలిపించమని తల్లితో పలికాడు. సత్యవతి కోడళ్లను యిరువురిని రప్పించింది అక్కడికి. వారిరువురిలో అంబిక, ఆ తాపసోత్తముని తపఃకాంతిని చూడలేక కళ్లు మూసుకున్నది. అందుచేతనే పుట్టుగుడ్డియైన ధృతరాష్ట్రుడు జన్మించాడు తర్వాత. మరల అంబాలిక ముందుకు వచ్చి, ఆయన తాపసరూపాన్ని చూచి భయం చెందింది. ఆమె పుత్రుడే పాండురాజు. ఆ యంబికా అంబాలికల వెనుక నిలబడియున్న వారి దాసికూడ ఆ మహాత్ముని నిర్మల హృదయంతో, భక్తిభావంతో తిలకించింది. అందుచేతనే వారా ఆమె, వినయసంపన్నుడు, వివేకి, నిరహంకారి, నిష్కాము

డు, నీతికోవిదుడు, భక్తితత్పరుడు, విజ్ఞానవేత్త, స్నేహశీలి, ధర్మరక్షకుడు, సర్వక్షేమకారకుడు అయిన విదురునికి తల్లి అయింది. ఆయన కీర్తిప్రతిష్ఠలన్నీ ఆ మాతృమూర్తివేకదా! విదురుని దాసీపుత్రుడని భావించినా, భారతంలో ఆయనకున్న గౌరవ ప్రతిష్ఠలు, యశస్సు, వేరొకరికి లేవని చెప్పవచ్చును.

విదురుని జీవితంలో మరొక విషయ మున్నది. మాండవ్యుడనే మహర్షి, తన ఆశ్రమంలో సమాధిలో మునిగిఉన్నాడు. ఆ దేశపు రాజ భవనంలో దొంగలు చొరబడి దొంగతనం చేశారు. ఆ దొంగలను చూచిన రాజభటులు వారివెంట వడ్డారు. వారిని చూచి భయంతో దొంగలు, యీ మహర్షి ఆశ్రమంలో చొరబడి, ఆ వస్తువులను, ఆ యాశ్రమంలో విడిచిపెట్టి పారిపోయారు. రాజభటులు ఆశ్రమంలో ప్రవేశించి, ఆ వస్తువులను గాంచి, ఆ మునివర్యుని దొంగగా భావించి, ఆయనను మహారాజువద్దకు తీసుకొని వెళ్ళి, రాజుముందు నిలిపారు. రాజు ఉచితానుచితజ్ఞాన శూన్యుడై, ఆయనను కొరత వేయించాడు. ఆ కొరతవలన కలిగిన బాధను సహిస్తూ, ఆసనంలో ములిక గుచ్చుకుంటున్నా నిశ్చలంగా ధ్యానమగ్నుడై యున్నాడు ఆయన. ఈ విషయాన్ని భటులద్వారా గ్రహించిన మహారాజు భయభ్రాంతుడై, ఆయనను చేరి, నమస్కరించి, క్షమించమని ప్రార్థించాడు. ఆ మహర్షిని బయటకు తీశారు రాజభటులు. కాని ఆ ములికమాత్రం బయటకురాక అట్లాగే ఉండి పోయింది. నాటినుండి ఆయన అణిమాండవ్యుడని

పిలువబడేవాడు. ఈవిధమైన శిక్ష తనకు ఎందుకు కలిగిందో తెలుసుకోవాలని ఆయన యమలోకం చేరాడు. లోనికి ప్రవేశించి, 'యమధర్మరాజా! నేను నేటివరకు తెలిసి ఏ పాపం చేయలేదు. కాని నాకు యీ శిక్ష ఎట్లా వచ్చింది?' అని అడిగాడు. 'మ హర్షీ! మీరు మీ బాల్యంలో తూనీగను పట్టుకొని, దాన్ని ఒక ముల్లుకు గుచ్చి బాధించారు. ఆ పాప ఫలితంగా యీనాడు మీకీ శిక్ష కలిగింది' అని సమాధానం యిచ్చాడు నరకాధిపతి. ఆమాట విని 'బాల్యం, తెలియని వయస్సు. అప్పుడు తెలియక చేసిన తప్పుకు యిప్పుడు శిక్షించటం అన్యాయం. తత్ఫలితంగా నీవు శూద్రకులంలో జన్మింతు వుగాక!' అని శపించాడు ఆ తపస్వి. ఆకారణంగా, శాపవశుడై, ధర్మమూర్తియైన యముడు విదురునిగా జనించాడు. శూద్రునిగా పుట్టినా, జీవితాంతం ధర్మాన్ని అనుసరించే ఉన్నాడు.

నీతికోవిదుడైన తమ్ముడిని విడిచి ఉండ లేక విదురుడు మొదటినుండియు ఆశారహితుడై, నిర్లిప్తస్థితిలో నున్నవాడే! అందుచేతనే, మాటిమాటికి మంచిని బోధిస్తున్న విదురునిపై కోపగించిన ధృతరాష్ట్రుడు, ఒకసారి 'బయటికి వెళ్లు' అని శాసించాడు. వెంటనే మారువలుకక ప్రశాంతంగా బయలుదేరిన విదురుడు, పాండవులున్న కామ్య కవనం చేరుకున్నాడు. కాని కొద్ది రోజులకే, మరల ధృతరాష్ట్రుడు విదురుని రమ్మని కబురు పంపాడు. రాజాజ్ఞను తిరస్కరింపక, ఏ మాత్రము కోపగింపక, తిరిగి హాస్తినాపురిలో ప్రవేశించి, తన కార్యముల

నిష్కామముగ నెరవేర్చిన నిష్కామకర్మధురీణుడు విదురుడు. అంతేకాక విదురుడు, బాధ్యతగా తన అమాత్యపదవిని నిర్వహిస్తున్ననూ, ప్రత్యక్షముగ తాను కురుక్షేత్రయుద్ధమున పాల్గొనకున్ననూ, కౌరవపాండవుల నయోధ్యకై అధికంగా పాటుపడిన వాడు. కురుక్షేత్రరణరంగంలో పాల్గొననివారు యిరువురు మనకు గోచరిస్తారు మహాభారతంలో. ఒకరు అహింసావాది, సర్వశాంతి కారకుడు, మహా ప్రాజ్ఞుడైన విదురుడు రెండవవాడు శ్రీకృష్ణభగవానుని అగ్రజుడైన బలరాముడు. బలరామునికి పాండవులు, కౌరవులుకూడా బంధువులు కావటం ఒక కారణం. తాను పాండవపక్షంలో చేరితే, తన ప్రియశిష్యుడైన దుర్యోధనుని మరణం చూడవలసివస్తుందనే భయం రెండవ కారణం. ఒకవేళ కౌరవపక్షంలో చేరితే, అధర్మపక్షంలో చేరాడనే అపవాదు తనకు వస్తుందనేది మూడవ కారణం. ఇక, తనకు ప్రియాతి ప్రియమైన తమ్ముడు కృష్ణుడు, పాండవపక్షంలో అర్జుననకు రథసారథి కావటం నాలుగవ కారణం. మరియు నీ విదుర బలరాములిరువురు, పాండవులకు విజయం తప్పక లభిస్తుందని గ్రహించుకున్నవారే! అందుచేతనే యీ యిరువురును రణరంగమున జొరబడక తీర్థయాత్రలకు వెళ్లారు. యాత్రానంతరం, సత్వ గుణసంపన్నుడైన విదురుడు మాత్రం ప్రశాంతమనస్కుడై, స్థితప్రజ్ఞుడై, నిశ్చలుడై, నిలిచాడు. కాని రజోగుణసంయుతుడైన బలరాముడు మాత్రం, కురుక్షేత్రరణరంగములో కురుసార్వభౌముని పరాజయము గ్రహించి, అశాంతియుతుడై, కోపతాప

ములకు లోనయ్యాడు.

ఈవిధంగా విదురుడు నిర్మల హృదయంతో ధర్మాన్ని ఆచరించేవాడు. 'పాండవ పక్షపాతి' అని కౌరవులచే అనిపించుకున్నా ధర్మవరాయణుల చూచి ఆనందించేవాడు. భగవంతుడైన శ్రీకృష్ణుని నిజతత్త్వం గ్రహించినవాడు. అందుచేతనే , రాయబారనమయంలో హస్తినాపురికి వచ్చిన శ్రీకృష్ణ భగవానుడు, దుర్యోధనుడు ఏర్పాటు చేసిన విందు భోజనం మాని, విదురుని గృహానికి వెళ్లి, విదురుని తరింవజేసి వచ్చాడు. కౌరవపాండవులు కలిసి జీవిస్తే మంచిదని పదేపదే బోధించాడు. అందరూ అధర్మానికి లొంగిపోయారు. అధర్మవరులైన కౌరవులు మారరు అని గ్రహించలేనివాడు కాదు విదురుడు. లోకక్షేమానికి, లోకశాంతికై తన జీవితాన్ని ధారపోసిన ఆ మహాత్ముడైన విదురుడు, చివరికి యోగబలంతో తన శరీరాన్ని వదలివేశాడు.

ఇట్టి నర్వలక్షణనంపన్నుడు, దయార్ద్ర హృదయుడు, పరమ శాంతమూర్తి అయిన విదురుడు అర్హుడైన వక్తయై, 'ధృతరాష్ట్రమహారాజా! మానవ జన్మకు రక్షణ ధర్మమేసుమా! కాన ధర్మాన్ని రక్షించు' అని వెయ్యివిధములుగా చెప్పుతూనే ఉన్నాడు. కాని అధర్మప్రవృత్తితో, అహంకార మమకార ఈర్ష్యానూయాదికమునకు వశుడైన ధృతరాష్ట్రుడు, విదురుని దివ్యనీతినుధను గ్రోలుతూ, అవినీతిని త్యజించలేకపోయాడు. అందుచేతనే చివరికి ధృత రాష్ట్రునికి మిగిలింది దుఃఖమే.

అయోగ్యునకు మిగిలేది శోకమేకదా! తాను చేస్తున్నది తప్పు అని ధృతరాష్ట్రునికి విదితమే. కావుననే భయంతో క్రుంగిపోయేవాడు. ఆ భయాన్ని పోగొట్టుకోటానికి విదురుని మాటిమాటికి తనవద్దకు రప్పించుకొనే వాడు. ధర్మప్రబోధాలను వినేవాడు. ముఖంమీది మచ్చను దర్పణానిదని భావించినవాడు, అద్దమును శుభ్రం చేస్తే ముఖంపై నున్న మచ్చ పోతుందా? అదేవిధంగా అనేక అవలక్షణాలను తన మనస్సులో నుంచుకున్న ధృతరాష్ట్రుడు ధర్మవిషయశ్రవణం చేసినంత మాత్రంతో ఆ దుష్టలక్షణాలు తొలగి పోతాయా? ధర్మాచరణతోనే సకల పాపములు క్షీణించిపోవాలి. కాబట్టి 'శ్రోతుమిచ్ఛామి తే ధర్మం' (వి. నీ. 1.15) విదురా ! నీనుండి ధర్మాన్ని వినగోరు చున్నాననియు, 'బ్రూహి భూయో మహాబుద్ధే ధర్మార్థసహితం వచః' (వి.నీ. 3.1) మహాబుద్ధిశాలీ! ధర్మార్థసహితములైన మాటలను మరికొన్నింటిని చెప్పుము అనియు, 'సర్వం త్వమాయతీయుక్తం భాషసే ప్రాజ్ఞ సమ్మతమ్। న చోత్సహే సుతం త్యక్తుం యతో ధర్మస్తతో జయః॥' (వి.నీ. 7.9) ప్రాజ్ఞసమ్మతములును, భవిష్యత్కాలమున మేలుచేయు సర్వమును నీవు చక్కగా చెప్పుచున్నావు. కాని నేనుమాత్రం నా కొడుకును వదలుటకు యిష్టపడుటలేదు. ఎక్కడ ధర్మముండునో అక్కడ జయము సిద్ధించుట జరుగును అనియు, 'ఏవమేతత్ యథా త్వం మామనుశాససి నిత్యదా। మమాపి చ మతిః సౌమ్య భవత్యేవ యదాతథా

మామ్॥' (వి.నీ. 8.30) సౌమ్యా! నీవు నాకు యీవిధంగా చెప్పుతూనే ఉన్నావు. నా బుద్ధియు అదేవిధంగా ఉంటుంది. అనగా 'సా తు బుద్ధిః కృతాప్యేవం పాండవాన్ ప్రతిమే సదా। దుర్యోధనం సమాసాద్య పునర్విపరివర్తతే॥' (వి.నీ.8.31) పాండవులనుగూర్చి నా బుద్ధి నిర్ణయించుకుంటుంది. కాని దుర్యోధనుని సమీపించగానే మరల నాబుద్ధి మారిపోవుచున్నది. దీన్నిబట్టి మమకారాన్ని పోగొట్టుకోటం ఎంత కష్టమో గ్రహించవచ్చును. ఆ మమకారం అధికం అయిన మానవుడు ఎంతటి నీచకార్యాన్నైనా చేయటానికి జంకడేమో! విదురుని ముందు యీ విధంగా పలికిన ధృతరాష్ట్రుడు, 'న దిష్టమవ్యతిక్రాంతుం శక్యం భూతేన కేనచిత్। దిష్టమేవ ధ్రువం మన్యే పౌరుషం తు నిరర్థకమ్॥' (వి.నీ. 8.32) ఏ జీవియు నదృష్టమును అతిక్రమింపలేడు. కాబట్టి అదృష్టమే స్థిరమైనదిగా తలుస్తున్నాను. పురుషప్రయత్నం వ్యర్థం అని తానే నిర్ణయించుకుని, తన తప్పుల నన్నింటిని అదృష్టంమీదికి త్రోసి వేశాడు. పురుషప్రయత్నం చేయలేక, అనేక దుఃఖాలలో నలిగి తపించిపోయాడు ధృతరాష్ట్రుడు. అధర్మవర్తనుడికి దుఃఖములే కాని సుఖాలు లభించవని ధృతరాష్ట్రుని జీవితం మానవాళికి ఒక సందేశాన్ని యిస్తుంది. అయోగ్యుడైన శ్రోతకు మిగిలేది దుఃఖమేకదా! సర్వకాలములలో యీ ధర్మాధర్మములకు, పుణ్యపాపములకు సంఘర్షణ తప్పదు. ఏది అధికం అయితే గెలుపు దానిదే అవుతుంది. ఒక్క భారతంలోనే, భాగవతంలోనే,

రామాయణంలోనే ధృతరాష్ట్రాది యీర్ష్యాళువులు, పరరాజ్యకాంక్షాయుతులు, శిశుహత్యాది పాపములచేయువారు, కారణంలేకనే బాధించువారు, పరదారాభిరతులున్నారని భావించరాదు. నేటి ప్రపంచంలో యిటువంటివారెందరో! కోకొల్లలు.

ఇక విదురనీతిలో విదురుడు బోధించని విషయం లేదని చెప్పవచ్చును. ధర్మాన్ని నొక్కి పలికాడు విదురుడు. తాను ధర్మాన్ని ఆచరించినా, ఆచరించకున్ననూ 'శ్రోతమిచ్ఛామి తే ధర్మం' నీ నుండి ధర్మాన్ని వినగోరుతున్నానని విదురుని అర్థించాడు ధృతరాష్ట్రుడు. దీనివలన మానవ జీవితంలో ధర్మానికి అగ్రస్థానం, ప్రథమస్థానం అని వ్యక్తం అవుతున్నది. భగవద్గీతలో, ప్రథమాధ్యాయంలో, ప్రథమశ్లోకంకూడా, 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే ...' అని ధర్మంతోనే ప్రారంభమై, 'అధ్యేష్యతే చయ ఇమం ధ్యర్మం సంవాదమావయోః' అని మరల 18 వ అధ్యాయం చివర ధర్మంతోనే పూర్తి అయినది. అంతేకాక 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' అని వైశేషిక దర్శనంలో, మొదటి సూత్రంలోనే శ్రీ కణాదముని వర్యునిచే ధర్మము వ్యాఖ్యానింపబడి, ఆపై 'యతోభ్యుదయన్నిశ్శేయసిద్ధిః స ధర్మః' అభ్యుదయ న్నిశ్శేయనములు దేనివలన లభిస్తాయో అదియే ధర్మమని నిర్వచింపబడినది. 'అథాతో ధర్మజిజ్ఞాసా' అని పూర్వమీమాంసాకర్తయైన శ్రీ జైమిని మహర్షికూడా ధర్మంతో సూత్రాన్ని ప్రారంభించి, 'చోదనాలక్షణార్థో ధర్మః' ప్రవృత్తి

కారణమైనది ధర్మమని ధర్మనిర్వచనం గావించాడు. మానవ జీవిత విధానానికి, మనుగడకు, ప్రశాంతతలకు ధర్మం అత్యవసరం. 'ధర్మో మూలం మనుష్యాణాం' మానవులకు ధర్మమే మూలమని దృఢంగా పలికింది శాస్త్రం. చతుర్విధ పురుషార్థములైన ధర్మార్థకామమోక్షములలో కూడ ప్రథమస్థానం ధర్మానిదే. పాండవులలో కూడా మొదటివాడు ధర్మరాజేకదా!

ధర్మం అంటే బాధ్యతా నిర్వహణ, ప్రవర్తన అని నిర్వచించుకోవచ్చు. అర్థం అంటే ధనం, కామం అంటే కోరిక, మోక్షం అంటే యీ సంసారబంధాల నుండి విడివడి, ప్రశాంతిగా జీవించటం అని భావించవచ్చును. ధర్మ మోక్షములు లేకుండా అర్థకామములపైననే నేటి ప్రపంచం ఆధారపడి ఉన్నదని చెప్పుకోవాలి. అధర్మ ప్రవర్తనతో ధన సంపాదన, కామప్రవర్తనలు అధికం అయినవి. అందుచేతనే మన మహర్షికోటి తీవ్రంగా యోచించి, మానవులు యీ అర్థకామాలను దుర్వినియోగం చేయరాదనే ఉద్దేశ్యంతో, మానవుల అభివృద్ధిని ఆకాంక్షించి, అర్థకామాలను మధ్యలో నుంచి, వాటికి రక్షకభటులలాగ అర్థమునకు ముందు ధర్మాన్ని, కామానికి అవతల మోక్షాన్ని నిలిపారు. అంటే 'ఓ మానవులారా! ధర్మబద్ధులై ధనార్జన చేసి, ధర్మానికికూడా వినియోగించండి. అప్పుడు ఉత్తమమైన జన్మ కలిగి, ఉత్తములుగా పరిగణింపబడతారు. అదేవిధంగా మోక్షం, అనగా భగవంతునికై కామాన్ని ఉపయోగించండి. అప్పుడు

మహాత్ములుగా రూపొందుతారు. అవసరమైనంత వరకు యీ లోకంకోసం అర్థకామాలను వాడుకొండి. సుఖాల ననుభవించండి. అతిగా వాడినప్పుడు పతనం కలుగుతుంది' అని ప్రచారం చేశారు. ధనం అధికం అయితే ధనవంతుడిననే అహంకారం విజృంభిస్తుంది. కామం అధికం అయితే రోగం వస్తుంది. రోగం వస్తే, ధర్మాన్ని ఆచరించ లేడు. కాన యీ రహస్యాన్ని గ్రహించి ఆచరించిన వారు ధన్యులు.

కృత, త్రేతా, ద్వాపర యుగాల్లో యీ ధర్మార్థకామమోక్షాలు నాలుగు ఎక్కువతక్కువలో ఉన్నవేమో కాని యీ కలియుగంలోమాత్రం ధర్మమోక్షాలు విశ్రాంతి తీసుకుంటున్నవేమో అనిపిస్తున్నది. నేడు యివి రెండూ దూరం కావటం చేత, అర్థకామాలు రెండు దేశపరిపాలన సాగిస్తున్నవి. అందుచేతనే ధనవ్యామోహం, కామోద్రేకం ప్రధానములై, స్వేచ్ఛగా, నిర్విఘ్నంగా వీరవిహారం చేస్తున్నవి.

ఈ ధర్మం ప్రతిజీవిలో ప్రవేశించి, ఎన్ని విధాలుగా పరిణమించినదో నిర్వచించటం కష్టమే. అంటే ఎవరెవరికి ఏఏ లక్షణాలుంటే యీ లోకం, యీసంఘం, యీప్రజ సుఖశాంతులతో వర్ధిల్లుతుందో అదే ధర్మం. అందుచేతనే పశుధర్మం, మానవధర్మం, యతిధర్మం, బ్రహ్మచారిధర్మం, గృహస్థధర్మం, వానప్రస్థధర్మం, బ్రాహ్మణధర్మం, క్షత్రియ ధర్మం, పితృధర్మం, పుత్రధర్మం, గురుధర్మం,

శిష్యధర్మం, రాజధర్మం, ప్రజాధర్మం, విద్యార్థిధర్మం, యజమానిధర్మం, సేవకధర్మం, సంఘధర్మం, లోకధర్మం మొదలైన రూపాలతో యీ ధర్మం విస్తరించి, ప్రపంచమంతా వ్యాపించి, ఆ స్థానము లకు సరియైన లక్షణాలను చేకూర్చింది. ఈ మొత్తం లక్షణాలను, బాధ్యతలను సవ్యంగా గ్రహించి నడుచుకున్ననాడు మానవులకు హృదయంలో శాంతి, గృహస్థులకు గృహాలలో శాంతి, సన్న్యాసు లకు ఆశ్రమాలలో శాంతి, పాలకులకు దేశంలో శాంతి, విద్యార్థులకు పాఠశాలలో శాంతి, సాధకులకు గురుసన్నిధిలో శాంతి, భక్తులకు దేవాలయంలో శాంతి, ప్రజలకు సంఘంలో శాంతి తప్పక లభిస్తాయి. వీటినన్నింటిని దృష్టిలో నుంచుకుని మన పెద్దలు ధర్మశీలురై, ధర్మప్రబోధ చేసి ఉంటారు. చెప్పేవారెవరైనా ఆచరించి చెప్పాలని, ఆచరించి గ్రంథరచనలు చేయాలని, ఆచరణ లోపించిననాడు మాటకుగాని, రచనల కుగాని, జీవితానికిగాని విలువ ఉండదు. అందు చేతనే 'ధర్మం చర' ధర్మాన్ని ఆచరించమని వేదమాత ఆదేశం.

నిండుగా నది ప్రవహిస్తున్నది. వాతావర ణం ప్రశాంతంగా ఉన్నది. వృక్షములు నీడతోపాటు, చల్లని గాలిని వీస్తున్నవి. అట్టి ఏకాంతప్రదేశంలో, రెండు పర్ణకుటీరాలను నిర్మించుకుని, జపధ్యానాదుల చేసుకుంటున్నారు యిద్దరు ఋషిపుంగవులు. వారిరువురు అన్నదమ్ములే! ఆకలి వేసినప్పుడు కందమూలఫలాలను భుజిస్తూ, దప్పిక కలిగినప్పుడు

చల్లని, స్వచ్ఛమైన, కాలుష్యంలేని నదీజలాన్ని త్రాగుతూ, ఆనందంగా, తృప్తిగా నివసిస్తున్నారు వారు. ప్రతిదినం ఉదయమే తమ్ముడు తన జపతపాదుల ముగించుకుని, ప్రక్కనే నివసిస్తున్న అన్నగారి ఆశ్రమానికి రావటం, అన్న బయటకు వచ్చువరకు వేచి ఉండటం, తర్వాత అన్నకు పాదాభివందనం ఆచరించటం, ఆపై శాస్త్రాధ్యయనాదులు, భగవత్సంబంధ విషయములు గ్రహించటం నిత్య కార్యక్రమాలుగా సాగుతున్నవి.

యథాప్రకారం, ఒకదినం ఉదయం తమ్ముడు అన్న కుటీరానికి వచ్చి కూర్చున్నాడు. అన్న బయటికి రావటం ఆలస్యం అయింది. ఈలోగా తమ్ముడికి ఆకలి వేసింది. అది మంచి వేసవికాలం. అన్న కుటీరానికి ముందున్న మామిడిచెట్లనిండా ఆరముగ్గిన మామిడిపండ్లు ఉన్నవి. వెంటనే లేచి, 2 పండ్లను కోసి తెచ్చుకున్నాడు తమ్ముడు. ఇంతలో అన్న బయటకు రావటం జరిగింది. తమ్ముడు ఆసనం మీదనుండి లేచి, అన్నకు నమస్కరించాడు. ప్రశాంతవదనంతో అన్న, తమ్ముని కుశలప్రశ్నలు వేశాడు. అనుకోనట్లు అన్న దృష్టి ఆ మామిడిపండ్లపైకి వెళ్లింది. ఏమిటని తమ్ముని ప్రశ్నించాడు. సమాధానం విన్నాడు. 'తమ్ముడూ! నీవు చేసినది చాలా తప్పు నాయనా! నాకు చెప్పకుండా నా ఆశ్రమంలోని పండ్లను కోయటం దొంగతనంతో సమానం. కాబట్టి నీవు 'దొంగతనం చేసినట్లేసుమా!' అన్నాడు అన్న. తమ్ముడు సూక్ష్మగ్రాహి, బుద్ధిమంతుడు. వెంటనే

తాను చేసినది తప్పని గ్రహించాడు. 'అన్నా! నీవు పలికింది సత్యమే. నాకు శిక్ష విధించు. ఆనందంగా స్వీకరిస్తాను' అన్నాడు వినయంగా. 'నాయనా ! తప్పు చేస్తే దండించేది నేను కాదు. బిడ్డ తప్పు చేస్తే తల్లి, శిష్యుడు తప్పు చేస్తే గురువు, సేవకుడు తప్పు చేస్తే యజమాని, విద్యార్థి తప్పు చేస్తే ఉపాధ్యాయుడు, ప్రజ తప్పు చేస్తే రాజు దండించాలి. కాబట్టి నీవు దేశనాథుడైన మహారాజువద్దకు వెళ్లి, శిక్ష పొంది రా తమ్ముడూ!' అని ఆదేశించాడు అన్న. తక్షణం బటలుదేరి వెళ్లాడు తమ్ముడు. మహర్షి రాకను ద్వారపాలకునిద్వారా తెలుసుకుని, ఆయనను సగౌరవంగా లోనికి ఆహ్వానించి, ఉచితాసనాన్ని యిచ్చి, అర్ఘ్యపాద్యాదులతో బూజించిన మహారాజు, చేతులు జోడించి, 'మహాత్మా! మీ రాక మాకు ఆనందదాయకం. మీ జపధ్యానములు చక్కగా జరుగుచున్నవా? మీకు ఏ ఆటంకములు లేవుగదా! నానుండి మీకేమి కావలయునో తెలియజేయండి. మీ సేవకు నంసిద్ధుడను' అని వినయవిధేయతలతో పలికిన ఆ మహారాజును చూచి, ఉప్పొంగిపోయిన ఆ ఋషిసత్తముడు, మహారాజు నాశీర్వదించి, తన తప్పును నిస్సంకోచముగా తెలియజేసి, శిక్షను విధించమన్నాడు. మహారాజు ఆ యన్నదమ్ముల ధర్మనిరతికి ఆనందించి, వెంటనే ఆస్థాన గురువులను, మహనీయులను పిలిపించాడు. 'ఈ తప్పుకు శిక్ష ఏమిటి' అని అడిగాడు. వారందరూ శాస్త్రగ్రంథముల కూలంకషంగా పరిశీలించిన పిమ్మట, 'మహారాజా! ఏ చేతులతో దొంగతనం చేశాడో ఆ చేతులను

నరకటమే యీ తప్పుకు తగిన శిక్ష' అని పలికారు. శిక్షను అమలు జరిపారు. శిక్షను పొంది, మొండి చేతులతో తిరిగి వచ్చాడు ఆశ్రమానికి. అన్న సాదరంగా ఆహ్వానించాడు తమ్ముని. గాఢంగా కౌగిలించుకున్నాడు. 'తమ్ముడూ! నీమీద నాకు కోపంలేదు నాయనా ! బోధించేవాడు ఆచరించాలి. అదేవిధంగా ధర్మశాస్త్రగ్రంథరచయితకూడా ఆచరణ చేయాలి. మనం ధర్మశాస్త్రాన్ని రచించాలను కుంటున్నాముగదా! మనమే ధర్మాన్ని తప్పితే మన గ్రంథం ఏమి ఆధర్మాన్ని తెలుపుతుంది? యిక ప్రజలు ధర్మాన్ని ఏమి ఆచరిస్తారు? కాబట్టి మనలో ఏ లోపం ఉండరాదనే భావనతో నిన్ను శిక్షపొంది రమ్మని రాజువద్దకు పంపాను' అని ధర్మ ప్రాశస్త్యాన్ని వివరించి, ఎదురుగా ప్రవహిస్తున్న నదిలో స్నానం చేసి రమ్మని తమ్ముని పంపించాడు. నదిలో దిగి, మునిగి, పైకి లేచిన తమ్ముడికి యథారీతిగా మరల రెండు చేతులు వచ్చాయి. ఆ నది పేరే బాహుదానది. ఆవిధంగా ఆనందంతో తిరిగివచ్చిన తమ్ముని చూచి 'తమ్ముడూ! చూచావా! నీ ధర్మమే నిన్ను రక్షించింది. 'ధర్మో రక్షతి రక్షితః' అను మన పెద్దల సూక్తిలో ఎంత సత్యమున్నదో గ్రహించు' అని వివరించాడు అన్న వారే శంఖధర్మశాస్త్ర రచయితలైన శంఖుడు, లిఖితుడు అను అన్నదమ్ములు. కాన మహాత్ములకు, మహారాజులకు, గురువరేణ్యులకు, పండిత వర్యులకు, ప్రబోధకులకు, ప్రచారకులకు, నాయకు లకు, ప్రజలకుకూడా ధర్మాచరణము అత్యంతా వశ్యకమని గ్రహించుకోవాలి.

ఇక నేటి ప్రపంచంలో, మూడు స్థానాలు విదేశసంస్కృతీ వ్యామోహంలో పడి, మన భారతీయ సంస్కృతికి దూరమయ్యాయని చెప్పవచ్చునం. గృహస్థజీవితరథాన్ని నడుపుకొనేవారు భార్యాభర్తలు. వారే తర్వాత తల్లిదండ్రులై, తమ బాధ్యతలను విస్మరించటంచేత తమ సంతానానికి బాల్యంనుండి అందించవలసిన ప్రేమాదరములతోపాటు బోధించవలసిన సద్విషయములనేకం ఉన్నాయి అని వారికి చెప్పలేక పోతున్నారు. మానవ సంస్కృతిని ప్రతిబింబింపజేసే రామాయణంలో, 'భక్తితో భగవంతుడు సాక్షాత్కరిస్తాడు. ఆనందం కలుగుతుం'దని నొక్కి పలికే భాగవతంలో, ఎన్ని రహస్యాలున్నవో! భారతంలో అనేక కథలున్నవి. వాటిని చక్కగా అవగాహన చేసికొని పిల్లలకు బోధించేవారేరి? చెప్పటంకూడా ఒక కళ. ఆవిధంగా ఆ కథలలోని అంతరార్థాలను, ఆ పసిహృదయాలకు, ఆ నిర్మల హృదయులకు అందించవలసిన బాధ్యత ఎవరిది ? ఆ కథాశ్రవణంతో వారికి, ఆ మహాత్ములమీద గౌరవం కలుగుతుంది. ఆ భావాలు, వారి మనస్సులపై చెరగని ముద్రను వేస్తాయి. అవి వారి భావిజీవితానికి సహాయాన్ని చేస్తాయి. తల్లిదండ్రులు ప్రత్యేకం ఒక సమయాన్ని వారికొరకు నిర్ణయించి, దానికి కట్టుబడి ఉండాలి. వారిచేత చిన్నచిన్న మాటలు చెప్పించి, ప్రార్థనలు చేయించాలి. ఎందుకు చేయాలో చెప్పాలి. సరిగా భోజనంచేయని అబ్బాయికి భీముని కథ చెప్పి, బలంగా ఉండాలని బోధించాలి. అబద్ధం చెప్పుతున్న పిల్లవాడికి

హరిశ్చంద్రుని కథ చెప్పి, సత్యాన్ని పలికి గొప్పవాడుగా ఉండాలని చెప్పాలి. తమ సంతానానికి ఉత్తమ సంస్కారాలను అందించే బాధ్యత తల్లిదండ్రులదేకదా! 'కాన్వెంటులో చదువుతున్నారు మా పిల్లలు. అందరికీ ఫస్టుక్లాసులే! ఇంగ్లీషులోనే మాట్లాడుతారు. తెలుగు అంత బాగారాదు.' అంటూ మనమే మన మాతృభాషను మరిచిపోయేటట్లు, 'అమ్మా! నాన్నా!' అనే పిలుపునుకూడా మరిచిపోయేటట్లు చేస్తున్నామని ప్రతి తల్లి గుర్తుంచుకోవాలి. తెలుగులో వ్రాయటం రాదు, చదవటం రాదు. తిథి, వార, నక్షత్రాల పేర్లుకూడా తెలియవుగదా! చెప్పేవారికైనా రావాలిగామరి! పసితనంలో తల్లి ఒడిలోనే నేర్చుకొనవలసినవి చాలా ఉన్నవి. అందుకే తల్లి మొదటి గురువు అన్నారు పెద్దలు. ఛత్రపతి శివాజీని మహావీరునిగా తీర్చిదిద్దింది తల్లి జిజియాబాయి. ధీరునిగా 'ఏ తల్లి తీర్చిదిద్దింది యిలాంటి అమృతపుత్రుడిని' అన్నట్లుగా వివేకానందుని తయారు చేసింది భువనేశ్వరీదేవి. అటువంటి తల్లియే మాతృదేవతగా ఆరాధింపబడుతుంది. భారతదేశం గొప్పదనీ, ఉన్నత భావాలతో ఉండాలనీ, ఆదర్శంగా జీవించాలనీ, అందరినీ ఆదరించాలనీ, తమ సంస్కృతిని మరచిపోరాదనీ, పరమత ద్వేషం కూడదని మొదలైన మాటలను, వాటి అర్థాలను తల్లి ఒడినుండే నేర్చుకోవాలి పిల్లలు. నేడు యీ తల్లి ఒడి చెడిపోయింది. పిల్లలలో, అన్నదమ్ములలో, యింకా అనేకచోట్ల ఐకమత్యంలేక, పరస్పర ద్వేషాలు అధికం అయ్యాయి.

ఇక రెండవది బడి. తల్లి ఒడిలో నేర్చుకొని
వాని నన్నింటిని మించి, సత్ప్రవర్తన కలిగి, విద్యమీదనే దృష్టినుంచి, ఆదర్శవంతమైన జీవితాన్ని ధ్యేయంగా పెట్టుకొని, అనవసర విషయముల మనస్సులోనికి చొరనీయక, వినయవిధేయతలతో, యథార్థమైన విద్య నార్జించు యథార్థ విద్య కావాలి. గురువును గౌరవించాలి. తోటివిద్యార్థులతో స్నేహంగా వుండాలి. రాజకీయాలకు దూరంగా వుండాలి. శ్రద్ధానక్తులు అత్యవసరం. విద్యానముపార్జనకు, జీవితాన్ని సరిజేసుకొనేందుకు యిది మంచి వయస్సుకదా! ఈ వయస్సులో మంచికంటే చెడు త్వరగా వస్తుంది. కారణం, సంఘం ఆ విధంగా ఉండటమే. 'ఆలస్యం మదమోహౌ చ చాపలం గోష్ఠిరేవ చ। స్తబ్ధతా చాభిమానిత్వం తథా అత్యాగిత్వమేవ చ॥ ఏతే వై సప్త దోషాః స్యుః సదా విద్యార్థినాం మతాః।' (వి. నీ. 8.45) ఆలస్యం, అహంకారం, చంచలత్వం, అనవసర ప్రసంగం, స్తబ్దత్వం, అభిమానం, లోభం, అను ఏడు దోషములును విద్యాసంపాదనకు ఆటంక దాయకములని విదురుని ఉపదేశం మరియు 'అశుశ్రూషా త్వరా శ్లాఘా విద్యాయాః శత్రవస్త్రయః।' (వి. నీ. 8.4) గురుసేవారాహిత్యం, తొందరపాటుతనం, ఆత్మస్తుతి అను నీ మూడును విద్యకు శత్రువులగుచున్నవి. నేడు బాల్యంలో ఉపనయనాలు లేవుగదా! ఉపనయనం చేస్తే, పవిత్రమైన గాయత్రీ మంత్రోపదేశం జరుగుతుంది. ఆ మంత్రజపంకోసం తెల్లవారుజామున మేల్కొనటం ఉండేది. ఇప్పుడు వాటి అవసరంలేదు

కాబట్టి ఏ సమయానికి నిద్రనుండిలేచినా అడిగే వారుండరు. సూర్యోదయాత్పూర్వమే స్నానాదికాలు లేకుండటంచేత శరీరఅనారోగ్యం, దేవతార్చనలులేక భక్తిరాహిత్యం, ఆసనాదికములు లేక యింద్రియ పటుత్వంలేకుండటం, ఆహార నియమం పాటించ కుండటంవలన అనేక విధములైన వ్యాధులకు గురికావటం జరుగుతున్నవి. మనోనిగ్రహం, శీలసంపదలు దిక్కుతోచక, త్రేతాయుగం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నవేమో! అంతవరకు దేనికి? నేడు చిన్ననుండి పెద్దలవరకు పుట్టినరోజులు చేసుకుంటు న్నారుగదా! మన సంప్రదాయాన్ననుసరించేవారు ఏరి? ఉదయమే అభ్యంగన స్నానం చేసి, నూత్న వస్త్రాలను ధరించి, దేవాలయానికి వెళ్లి, తమ గోత్ర నామములతో అర్చన చేయించుకొనే వారున్నారా? సర్వ ప్రపంచాన్ని సృజించి, మానవాళి సుఖసంతోష ములకై సకల సుఖసంబారాలను ప్రసాదించిన భగవంతుని స్మరిస్తున్నారా? అశుభం శుభం తెలియని, పంచవర్షప్రాయుడైన పసివానిముందు, 5 మైనపు ఒత్తులను, ఒక కేకును బల్లమీద ఉంచి, 'బాబూ! ఈ ఒత్తులను వెలిగించి, ఆర్పేసెయ్! ఆ చాకుతో ఆ కేకును చక్కగా కోసెయ్!' అని వాడిచేత ఆ పనులు చేయించి, అందరూ కరతాళధ్వనులు చేస్తున్నారు. ఇదేమి సంప్రదాయం? అంటే యీ విధంగా దీపాలార్పి, పీకలు కోసి, కొంపలు కూల్చమనా అర్థం? ఈవిధంగా బాల్యంనుండి సత్సంప్రదాయాలు మరిచినవారికి మనోనిగ్రహం, శీలసంపదలు ఎట్లా వస్తాయి? మనోనిగ్రహం,

నైర్మల్యం, అమూల్యసంపదలు అనిగదా శ్రీ శారదామాత ప్రబోధం. కృషి చేస్తేగాని యివిరావు. ఆనందమయ భావిజీవితానికి పునాదులు వేసుకోవలసిన దశ విద్యార్థిదశే! అందుచేతనే 'సుఖార్థినః కుతో విద్యా నాస్తి విద్యార్థినః సుఖమ్। సుఖార్థీ వా త్యజేద్విద్యాం విద్యార్థీ వా త్యజేత్సుఖమ్॥' (వి.నీ.8.6) సుఖకాంక్షితునికి విద్య రాదు. విద్యావాంఛితునికి సుఖం కూడదు. సుఖార్థి విద్యను, విద్యార్థి సుఖాన్ని త్యజించాలి. నేటి విద్యలో వ్యక్తివికాసం అగోచరం. పాఠముల అభివృద్ధియో, పాఠశాలల అభివృద్ధియో తెలియటం లేదు. నేటి విద్యార్థులలో సత్ప్రవర్తన పూర్తిగా లోపించిందనవచ్చును. అవును. 'చదువు కొనుచున్నారు' అను మాటలోనే చదువును - కొనుచున్నారుకదా! ఒక్క చదువునేమిటి? అధికారాల్ని కూడా కొనుక్కుంటున్నారుకదా! ఈవిధంగా అన్నీ కొనుక్కుని, ఎంత ఖర్చు అయిందో లెక్కించుకొని, వివాహసమయంలో వ్యక్తిత్వంలేక కట్నానికి అమ్ముడుపోతున్నారు. అందుచేతనే విద్య, మానసిక పరిణామాన్ని కలిగించనంతవరకు యీ సమాజం మారదు, మారదు, మారదు.

ఇక, బడి అనగా పాఠశాలలో బోధించేవారు ఉపాధ్యాయులు అనగా గురువులు. విద్యను బోధించు ఆ గురువులకుకూడ శాస్త్రం కొన్ని లక్షణాలను నిర్దేశించింది. శాస్త్రం ఎప్పుడూ నిష్పక్షపాతంగా, ఎల్లరి సుఖసంతోషాలకు కారణం అవుతుంది. విద్యార్థులను వాత్సల్యంతో చూచేవాడు,

క్రోధరహితుడు, అభివృద్ధిని కాంక్షించేవాడు, ఈర్ష్యారహితుడు, జ్ఞానశ్రేష్ఠుడు, అవసరానవసరముల గుర్తించి బోధించువాడు, పక్షపాతము చూపించని వాడు గురువు. లౌకిక, అలౌకిక విద్యలమధ్య వారధివంటివాడు గురువు అనవచ్చును. లౌకిక విద్యను బోధిస్తూ, అలౌకిక విద్యయైన ఆధ్యాత్మిక జ్ఞాన విశిష్ఠతను, మన సంస్కృతీ ప్రాశస్త్యాన్ని, మరియు విదేశ సంస్కృతిలోని గొప్పదనాన్నికూడా నిష్పక్షపాతంగా విద్యార్థుల హృదయాలకు హత్తుకొనేటట్లు చేయాలి గురువు. తన చక్కని నడవడికచేత విద్యార్థుల గౌరవాన్నందుకోవాలి గురువు. ధర్మాచరణ చేస్తూ, విద్యార్థులు అధర్మ ప్రవర్తకులు కాకుండా చూచే బాధ్యత గురువుదే! సర్వవిద్యలలో ఆరితేరిన నాటి గురుకులాశ్రమాలను నిర్వహించు గురువులద్వారా అభివృద్ధి ఆచరణములుగల విద్యార్థులు, బ్రహ్మచారులు, గృహస్థులు, సన్న్యాసులు, మహారాజులు, పౌరులు తయారై ఆశ్రమాలకు, గృహాలకు, దేశానికి ఆదర్శం అయ్యారు. ఇది గురువుల బాధ్యతకదా! ఈ విధమైన గురు - శిష్యుల కలయికే బడి. అదే నేడు చెడిపోయింది.

మూడవది గుడి. అనగా దేవస్థానం, లేక దేవాలయం. 'ఇంటికంటే గుడి పదిలం' అనే సామెత ఉన్నదిగదా! ఇల్లు అంటే యీ శరీరం. ఈ శరీరం పుట్టుతూ, చస్తూ ఉంటుంది. ఇక గుడి అంటే దేవుడుండేది. దేవుడు నిత్యమైనవాడని గదా అర్థం. అందుచేత, అనిత్యమైన శరీరాన్ని నమ్ముకొని

లౌకిక జీవితంలో మునుగవద్దు. నిత్యస్వరూపుడైన భగవానుని విశ్వసించి వదిలంగా ఉండు' అని ఆ సామెత ప్రజలకు ఒక సందేశాన్నిస్తుందేమో! దేవాలయ ప్రాముఖ్యత ఏమిటి ? మానవునికి అశాంతిని దూరం చేసి, శాంతిని ప్రసాదించేది గుడి. అపవిత్ర భావముల నశింపజేసి, పవిత్ర భావముల నుద్భవింపజేసేది గుడి. లౌకిక దృశ్యాలను చూచి చూచి, విసిగి, వేసారి ఉన్న మానవ నేత్రములకు భగవంతుని దివ్యమంగళస్వరూపాన్ని దర్శింపజేసి, ఆనందాన్ని కలిగించేది గుడి. సగుణారాధనకు, సగుణోపాననకు ఏకాగ్రతను సూచించునది గుడి. ఏ మహర్షిపుంగవులో, ఏ దివ్యాత్ములో, తమ తపశ్శక్తిని ధారపోసి, ఆ యా దేవతలను, ఆ యా దేవాలయాలలో ప్రతిష్ఠించారు. ఆనాడు. అందుచేతనే అవి యీనాటికి శాశ్వతంగా వుండి, భక్తులను రప్పించుకుంటున్నాయి పుణ్యక్షేత్రసందర్శనం అనే పేరుతో గుడిలోని ఆవరణం పరిశుభ్రంగా ఉన్నట్లు, 'దేహో దేవాలయః' అనురీతి మానవుని శరీరంకూడా పవిత్రంగా ఉండాలని, గర్భగుడియందలి అర్చామూర్తి పూజాదికములచే దివ్యకాంతిని ప్రసరింపజేసినట్లు, మానవహృదయమునందలి పరమాత్మయు ప్రకాశించి, మానవుని అజ్ఞానమను చీకటిని పారద్రోలాలనే ఆ మహాపురుషుల భావమేమో! చక్కని విద్యాసంస్కారములతో అలరారుచూ, భక్తిప్రపత్తులతో భగవానుని అర్చించు వారిని అర్చకులుగా ఉంచారు. గుడిని పవిత్రంగా ఉంచి, ధర్మతత్పరులై, భక్తితో భగవంతుని సేవించి

నంతకాలం మానవులకు అశాంతి లేదు. దేశానికి అరిష్టం లేదు. నేడు అందరూ ఆలయ నిర్మాతలే గదా! ఆనాడు పవిత్ర వ్యక్తి సంకల్పం ముఖ్యం. ఈనాడు ధనం ముఖ్యం. నేటి దేవాలయాలలో తాత్కాలిక ఆకర్షణలకు, ప్రచారములకు, అధికారములకుమాత్రమే విలువలుగాని, యథార్థ భక్తికి, భక్తులకు స్థానం లేదనవచ్చును. అన్ని దేవాలయాలు అటువంటివికావని అర్థం చేసుకోవాలి. ఇది గుడి ప్రాముఖ్యం.

మన భారతదేశంయొక్క అత్యున్నతాధ్యాత్మిక స్థానం యీ ఒడి, బడి, గుడి అనే త్రివేణీ సంగమంలో ఆదర్శాన్ని అందుకుంది. తల్లిబిడ్డల పవిత్ర ప్రేమ సంబంధం, గురుశిష్యుల ఆత్మజ్ఞానవిభూతులు, భక్తిభగవానుల ఉపాసనా సంస్థితులు, పారమార్థిక గురుపీఠాన్నుండి మానవుడు పతనంకాకుండా అంగరక్షకులై రక్షిస్తున్నవనుటలో అతిశయోక్తి లేదేమో! మాతృమూర్తి ఒడి, బిడ్డలకు శారీరకపరిణతిని, పవిత్రతల నందించగా; విద్యానిలయమైన బడి, గురుశిష్యుల సంబంధాన్ని పటిష్ఠం చేసి, శిష్యులకు మనోవికాసాన్ని, వివేకాల్ని వికసింపజేయగా; భక్తికి మూలమైన భగవంతుని గుడి, భక్తుల హృదయాన్ని స్పందింపజేసి, మానవుని ద్వంద్వరహితుని గావించి, ప్రశాంతతల నందిస్తూ, లోకకల్యాణానికి తోడ్పడుతూ, మానవుని మానవునిగా, మానవుని పండితునిగా, మానవుని మహాభక్తునిగా, మానవుని మహాజ్ఞానిగా, తయారు చేయగలవని సగర్వంగా చెప్పుకోవచ్చు.

ఇదే భారతదేశంయొక్క ప్రత్యేకత! ఇదే మన భారతదేశ ఔన్నత్యానికి పునాది! మానవత్వంనుండి మాధవత్వానికి, మాధవత్వంనుండి బ్రహ్మత్వంవరకు గల మానవుని ప్రగతిని శాస్త్రంద్వారా, మహాత్ముల ద్వారా ప్రబోధించినది మన భారతదేశమేగదా!

సూక్తులు, ప్రబోధాలు మానవులకేగాని భగవంతునికిలేవు. శాస్త్రములకే కారణమైన ఆయనకు శాస్త్రప్రబోధాలు ఎందుకు ? నిర్గుణ, నిరాకారమైన ఒక దివ్యశక్తి సాకారమై, సగుణమై, ప్రపంచ సృష్టి, స్థితి, లయాలను చేస్తున్నదిగదా! ఆ జగన్నాటక శక్తి స్త్రీ పురుష నపుంసకలింగములకతీతమై, 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' అనురీతి ఉపాసనాపరుల సౌకర్యంకోసం బ్రహ్మమునకు రూపకల్పన జరిగిందని శాస్త్రవచనం. శాస్త్రములన్నీ మానవులకొరకే పుట్టి, మానవాళికి తారణోపాయాన్ని సూచించాయి. ఆ శాస్త్రాదేశాను సారముగా తమ జీవితముల సంస్కరించుకొని, పునీతము గావించుకొని, బ్రహ్మానందాన్ని అనుభవించిన పుణ్యాత్ములుకూడ, తమ బాధ్యతల గ్రహించి, మానవ శ్రేయస్సును దృష్టిలో నుంచుకుని, 'శాంతా మహాంతో నివసంతి సంతః వసంతవ ల్లోకహితం చరంతః' మహాత్ములై, శాంతులై నివసించు సత్పురుషులు వసంతకాలమువలె లోకహితంకోసం చరిస్తూ ఉంటారను 'వివేకచూడామణి' వాక్యమురీతిగా దేశముల బర్యటించుచు ప్రచారం చేశారు. ఆ శాస్త్రములకు, మహాత్ములకు ఋణపడి

ఉన్నాం మనం.

మహాత్ములు సంకల్పసిద్ధులుగదా! అందుచేత వారు 'లోకాస్సమస్తాస్సుఖినో భవంతు' సర్వ లోకములు సుఖంగా ఉండాలని వారు హృదయపూర్వకంగా కోరుకుంటారు. అది వారి సహజస్వభావం. వారికి ద్వేషం కలుగదు. 'దంభం మోహం మత్సరం పాపకృత్యం రాజద్విష్టం పైశునం పూగవైరమ్। మత్తోన్మత్తైః దుర్జనస్యాపి వాదం యః ప్రజ్ఞావాన్ వర్జయేత్ సప్రధానః॥' (వి.నీ 1.115) దంభ, మోహ, మాత్సర్య, లోభాలను పొందక, పాపకార్యముల జేయక, అహంకార ఉన్మత్త దుర్జనులతో వాదము గావింపక, ద్రోహబుద్ధి రహితుడు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడని నిర్వచనం. ప్రాపంచికవ్యామోహంపై ఆధారపడి పుంటాయి యీ ఆడంబర, మాత్సర్య, లోభాలు. వ్యామోహం కలిగిన వెంటనే ఆ వస్తు సంపాదనకు పాపకార్యం చేయటం జరుగుతుంది. ఆ పాపకర్మల చేయుటకు దుర్జనుల, ఉన్మత్తుల సహవాసం అవసర మనిపిస్తుంది. ద్రోహబుద్ధి కలుగుతుంది. ఆ ద్రోహబుద్ధికి పెద్ద చిన్న తారతమ్యం గోచరించదు. ఆ ద్రోహబుద్ధి తల్లిదండ్రులు, స్నేహితులనుండి ప్రారంభమై, మాతృద్రోహం, మిత్రద్రోహం, భ్రాతృద్రోహం, పితృద్రోహములతో తృప్తినొందక రాజద్రోహ, దేశద్రోహములవరకు పెరిగి, అమాయక ప్రజలను, తన దేశాన్ని, చివరికి దేవాలయాలనుకూడ దోచుకోవాలనే తీవ్ర యత్నం చేస్తాడు. ఈ సర్వానర్థాలకు కారణం మోహం. ఆ మోహం

ఏమాత్రంలేని మహాత్ములేకదా శ్రేష్ఠులు! మరియు 'మితం భుంక్తే సంవిభజ్యాశ్రితేభ్యో మితం స్వపిత్యమితం కర్మ కృత్వా|' (వి. నీ. 1.118) మితాహారము గైకొనుట, ఆశ్రితులకు వంచిపెట్టుట, స్వల్పకాలము నిద్రించుట, అధికముగా పనులు చేయుట అను నీ లక్షణములు మహాత్ములలో నుండును. అందుచేతనే 'ఏకః స్వాదు న భుంజీత' (వి.నీ 1.46) రుచియైన పదార్థమును ఒక్కడే భుజింపరాదనే సూక్తి వారికే అన్వయిస్తుంది. మితభోజనం శరీరానికి ఆరోగ్యాన్నిచ్చి, శరీరాన్ని తేలిక చేస్తుంది. మరియు మిత నిద్ర తమోగుణాన్ని దూరం చేసి, బుద్ధి కుశలతను కలిగిస్తుంది. బుద్ధి వికాసంచేత, నిత్యానిత్యవిచక్షణాజ్ఞానం అభివృద్ధి చెందుతుంది. అటువంటివాడు 'వశ్యేంద్రియం యతాత్మానం ధృతదండం వికారిషు| పరీక్ష్యకారిణం ధీరమత్యంతం శ్రీర్నిషేవతే|| '(వి.నీ. 2.55) ఇంద్రియనిగ్రహుడై, మనస్సును వశ పరచుకొని, వికారహేతువులైన వానిని శిక్షించుచు, కార్యముల విచారించి చేయునట్టి ధీరుని శ్రీదేవి సదా అనుగ్రహించునని తాత్పర్యం.

ఈ యింద్రియనిరోధం, మానవునికి అత్యంతావశ్యకమే కాని, నిగ్రహం కష్టాతికష్టం. మానవుడు శ్రోత్ర, త్వక్చక్షు, జిహ్వా ఘ్రాణములను పంచ జ్ఞానేంద్రియములతో, వాక్పాణిపాదపాయూపస్థలను పంచ కర్మేంద్రియములతో కూడినవాడని శాస్త్రం. ఈ దశేంద్రియనిగ్రహం బాహ్యేంద్రియ నిగ్రహం. ఈ పది యింద్రియాలను శాసించేది

మనస్సు. ఇది బాహ్యానికి అగోచరం. దీన్ని అంతరింద్రియం అంటారు. దీన్ని నిగ్రహిస్తే అంతరింద్రియనిగ్రహం అవుతుంది. ఈ బాహ్య, అంతరింద్రియనిగ్రహం కలవారికి లోకం పాదాక్రాంతం అవుతుంది. కాని ఒక్కొక్క యింద్రియం, ఒక్కొక్క విషయంకోసం పరుగులు వేస్తుంటే, వాటిని నిలపటం సులభమా? అది గుర్వనుగ్రహం, భగవదనుగ్రహం, తీవ్రకృషివల్లనే సాధ్యం అవుతుంది సుసంస్కారవంతుడికిమాత్రం. 'శబ్దాదిభిః పంచభిరేవ పంచ పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః। కురంగమాతంగ పతంగ మీన భృంగాః నరః పంచభిరంచితః కిమ్॥' అని శ్రీశంకరులు తమ 'వివేకచూడామణి' గ్రంథంలో యీ శ్లోకాన్ని చక్కగా వ్రాశారు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంథములను వానిచేత, ఆ యా గుణములు కలిగిన లేడి, ఏనుగు, మిడుత, చేప, భృంగిమలు అను ఐదును మరణాన్ని పొందుచున్నవి. ఈ శబ్దాది పంచవిషయములు గల మానవుని విషయంలో ఏమి చేయవలెనని ప్రశ్న. శ్రవణేంద్రియ ప్రధానమైన లేడి, శబ్దానికి వశమై, వేటగానికి చిక్కి మరణించుచున్నది. త్వగింద్రియ ప్రాధాన్యత గల ఏనుగు, ఆడఏనుగు స్పర్శకై తపించి, ఏనుగుల బంధించువారు త్రవ్విన గుంటలో పడి, వారికి బందీయై మృత్యువును పొందుచున్నది. మరియు నేత్రేంద్రియ ప్రధానమైన మిడుత, రూపమును కాంక్షించి, అగ్నికి ఆహుతి యగుచున్నది. అదేవిధముగా జిహ్వేంద్రియ ప్రధానమైన మత్స్యము రసనం అనగా రుచికొరకు

ఎరను ఆశించి, గాలమునకు తగిలి చనిపోవుచున్నది. ఇక అయిదవదైన ఘ్రాణేంద్రియముచే గంధమునకు లోబడిన మధుపము కూడ, పంచత్వమును పొందు చున్నది. ఒక్కొక్క యింద్రియమును ప్రధానముగా గలిగిన యీ అయిదు మరణమును పొందుచుండ, నిక యీ మానవుడు పంచేంద్రియములకు వశుడై, 'పునరపి జననం పునరపి మరణం' అను శ్రీ శంకరుల వచన విధానమున జననమరణముల బడి మ్రగ్గుచుండునని తాత్పర్యము. అందుచేతనే 'బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి' అని బలమైన యీ యింద్రియసమూహము విద్వాంసుని గూడ లొంగదీయుచున్నదని శ్రీ వ్యాస భగవానుడు వచించియున్నాడు. యథార్థమే. బలమైన ఏనుగును బంధించటానికి ధృఢమైన వృక్షం అవసరమైనట్లు బలమైన యింద్రియాలను వశం చేసుకొనటానికి, సత్సంస్కారం, సత్పురుష సందర్శనం, సద్గ్రంథ పఠనం, సద్గ్రంథ శ్రవణం, సద్గురు సన్నిధానంలో సత్సాధనలను సాధకుడు చేయాలి. అప్పుడే నిగ్రహం సాధ్యం. అట్టివానికి చక్కని ప్రజ్ఞ ఏర్పడుతుంది. బ్రహ్మజ్ఞానసంపద సిద్ధిస్తుంది. అందుచేతనే 'యద్బలానాం బలం శ్రేష్ఠం తత్ప్రజ్ఞాబలముచ్యతే!' (వి. నీ. 5.55) బలము లన్నింటిలో ప్రజ్ఞాబలం శ్రేష్ఠమని చెప్పబడుచున్నది. ధనబలం, శారీరకబలం, విద్యాబలం అను మూడును ప్రజ్ఞాబలానికి దాసోహం అంటాయి. పూర్వం ప్రజ్ఞావంతులైనవారు విద్య నేర్పాలంటే, మంచి బుద్ధి బలం గలవారిని మాత్రమే శిష్యులుగా

చేర్చుకొనేవారు.

ఒక గురువుగారివద్దకు యిరువురు బ్రహ్మచారులు వెళ్లారు. ఆయన విద్యార్థులకు సుస్వరంతో వేదాన్ని చదువుతూ, అర్థాన్ని బోధిస్తున్నారు. బ్రహ్మచారులిద్దరూ సాష్టాంగనమస్కారం ఆచరించారు. తాము వచ్చిన పనిని తెలిపారు. ఆయన వారిద్దరిని పరికించి చూచారు. 'నాయనలారా! మీ రాకకు చాలా ఆనందం. అక్కడున్న 2 పర్ణకుటీరాలను చూడండి. వెళ్లి, అక్కడ కూర్చోండి. మీకు చెరొక అర్థరూపాయి యిస్తున్నాను. సాయంకాలంలోగా మీరు, ఆ ధనంతో రెండు పర్ణశాలలను నింపి, నన్ను పిలవండి' అని వారికి చెప్పాడు. ఆయన చెప్పినట్లు చేశారు యిరువురు. సాయంత్రం అయింది. సాయంకాల కార్యక్రమం ముగించుకున్న గురువు వద్దకు వెళ్లి, ఆయనను తమ పర్ణశాలలకు రమ్మని ఆహ్వానించారు. వారితో కలిసి వెళ్లాడు ఆయన. మొదటి బ్రహ్మచారి, తన కుటీరం తలుపులను తెరిచి,'గురువర్యా! మీరిచ్చిన పైకంతో గడ్డిని తెచ్చి నింపాను. ఆ గడ్డి, యీ గదిని పూర్తిగా నింపింది' అని చూపించాడు. 'సంతోషం నాయనా!' అన్నాడు గురువు. రెండవ బ్రహ్మచారి కుటీరానికి వెళ్లాడు. అతడు తలుపులను తెరిచి, 'స్వామీ! మీరిచ్చిన ధనంతో ఒక ప్రమిదను, ఒక వత్తిని, ఒక అగ్గిపెట్టెను, కొద్దిగా నూనెను తీసుకొని, ప్రమిదలో నూనెను వేసి, వత్తిని దానిలో ముంచి, వెలిగించాను. ఆ కాంతితో యీ కుటీరాన్ని

నింపాను. ఇదిగో మిగిలిన పైకం' అని చెప్పి గురువుకందించాడు. 'సంతోషం నాయనా!' అన్నాడు గురువు. వారిద్దరూ గురువుగారి వెంట బయలుదేరి, ఆయన కుటీరంలోకి వచ్చారు. మొదటి బ్రహ్మచారిని చూచి 'నాయనా! నీకు నావద్ద విద్యరాదు. కుటీరాన్ని నింపటానికి నీ స్థూలబుద్ధికి గడ్డితప్ప వేరేమీ దొరకనందుకు చింతిస్తున్నాను. ఇక నీవు పశువులను మేపుకోవచ్చును. వెళ్లిరా' అని చెప్పాడు. రెండవ బ్రహ్మచారిని ఆనందంతో వీక్షించి, 'నాయనా! నీ సూక్ష్మబుద్ధికి చాలా సంతోషం. నీవు ఆశ్రమంలో ఉండవచ్చును. రేపటినుండి నీకు కావలసిన విద్యను బోధించ గలను. నీవు విద్యావంతుడివై, ఆదర్శవంతుడివై, లోకంలో ఒక ధృవతారవలె ప్రకాశిస్తావు' అని ఆశీర్వదించాడు. నేడుకూడా మానవాళిలో అఖండమైన తెలివితేటలు కనిపిస్తున్నవి. కాని ఆ తెలివితేటలు, క్రమశిక్షణారాహిత్యంవల్ల వక్ర మార్గంలో నడుస్తున్నవి. తల్లిదండ్రులను లెక్క చేయకుండటం, ఉపాధ్యాయులపై దాడి జరపటం, రాజకీయాలలో అమితోత్సాహంతో పాల్గొనటం వంటి అనేక అవలక్షణాలు అభివృద్ధిని పొందాయి. ఈ లోపం రోజురోజుకు పెరుగుతూనే ఉన్నదికాని తరగటంలేదు.

ప్రజ్ఞామూర్తులు లోకంలో అరుదుగా లభిస్తారు. వారు జితేంద్రియులై, నిష్కాములై, వైరాగ్యనిధులై ఉంటారు. అట్టి మహానుభావుల దర్శన, సంభాషణ, సేవలు పూర్వజన్మ

సుకృతంచేతనే లభ్యం. వారు ప్రచారం చేసుకోరు, చేయించుకోరు. అటువంటివారు తటస్థపడినా, వారిని మన లౌకికదృష్టితో చూచి విమర్శించుతాము. నిర్మలదృష్టి ఏర్పడాలి వారిని గ్రహించటానికి. వారి శ్రేష్ఠత్వాన్ని అర్థం చేసుకుంటేగాని వారిని అనుసరించలేము. అనుభవంతో పండి, నిండిన ఆ పుణ్యపురుషులకు మనసారా నమస్కరిస్తే చాలు. వారి ఆశీర్వచనం చాలు. వారి కరుణాదృష్టి చాలు. వారి చల్లనిమాట చాలు. సాధకహృదయాలలో అమృతం వర్షిస్తుంది. అదే జన్మరాహిత్యాన్ని ప్రసాదిస్తుంది.

జగత్తును సృజించి, రక్షించి, శాసించేవాడు జగత్ప్రభువైన ఈశ్వరుడు. కాని ఒక దేశాన్ని చక్కగా బాధ్యతతో పరిపాలించి, ప్రజారక్షణ చేయువాడు మహారాజు. భగవద్భక్తి కలిగి, మహాత్ముల గౌరవించి, విద్యాపోషణ గావించి, కళలను ఆదరించి, కవుల పోషించి, వినయవివేకాది సుగుణములచే ప్రజల మన్ననల పొంది, ప్రజల కన్నతండ్రివలె కాపాడి, ధర్మము నవలంబించి, బ్రహ్మవిద్యాసభల నేర్పాటు గావించి, మహా పండితుల నాహ్వానించి, వారివద్ద అనేక ఆధ్యాత్మిక రహస్యములను గ్రహించి, ధర్మపాలనమొనరించిన మహారాజులు అశ్వపతి, జనకుడు మొదలైనవారు ఆదర్శవంతులు, చిరస్మరణీయులు. ఆ ప్రభువులు ప్రజలను రక్షించేవారు. ఆ ప్రభువులను ధర్మంతప్పక రాజ్యపాలన చేసేటట్లు శాసించారు మహర్షివర్యులు. ఆ ప్రభువులకు అండదండలుగ నిలిచిన ఋషి పుంగవుల నామధేయాలు ఆచంద్రతారార్కం

ఉంటాయి. ఆ మునిచంద్రులు ధర్మస్వరూపులై, ధర్మనిరతులై, ధర్మప్రవర్తకులై, ధర్మదండధారులై, మొత్తం ప్రపంచాన్ని నిరపేక్షులై శాసించి, జగద్వంద్యులయ్యారు. అందుచేతనే రాజధర్మం ఎటువంటిదో, రాజు ప్రజాపాలన ఏవిధంగా చేయాలో, రాజలక్షణాలు ఏమిటో, రాజు ఏవిధంగా ప్రవర్తించాలో, రాజు-మంత్రి, రాజు-ప్రజలు, రాజు సేవకుల సంబంధాలను ఏవిధంగా చక్కగా కాపాడుకోవాలో విదురుడు ధృతరాష్ట్రునికి బోధ చేశాడు.

'ధర్మమాచరతో రాజ్ఞః సద్భిశ్చరితమాదితః। వసుధా వసుసంపూర్ణా వర్ధతే భూతివర్ధినీ॥' (వి.నీ.2.28) సత్పురుషులు అనాదినుండి ఆచరించిన ధర్మముల నాచరించు రాజునకు, భూమి సకల సంపదలను యిస్తుంది. 'ధర్మేణ రాజ్యం విందేత ధర్మేణ పరిపాలయేత్। ధర్మమూలం శ్రియం ప్రాప్య న జహాతి న హీయతే॥' (వి.నీ.2.31) ధర్మముతో రాజ్యసంపాదన గావించి, ధర్మ పరిపాలన చేసి, ధర్మమూలమైన సంపదల రాజు పొందవలయును. ధర్మాశ్రిత విత్తము నశింపదు, తరగదు. మరియు, 'ద్విజాతిపూజాభిరతో దాతా జ్ఞాతిషు చార్జవీ। క్షత్రియశ్శీలభాక్ రాజంశ్చిరం పాలయేత్ మహీమ్॥' (వి.నీ. 3.74)సద్బ్రాహ్మణుల పూజాభిరతియు, దానశీలియు, నిష్కపటుడును, శీలవంతుడును అయిన రాజు, రాజ్యమును చక్కగా చిరకాలము పరిపాలించును. ధర్మమునే ఆశ్ర యించాలి ప్రథమంగా అని 'అర్థసిద్ధిం పరామిచ్ఛన్

ధర్మమేవాదితశ్చరేత్। నహి ధర్మాదపైత్యర్థః స్వర్గ లోకాదివామృతమ్॥' (వి.నీ.5.48) ధనము గొప్పదని భావించి, దానిని కాంక్షించినవాడైన రాజును ప్రథమమున ధర్మమునే ఆచరింపవలయును. అమృతం స్వర్గంనుండి వైతొలగనట్టు, అర్థముకూడ, ధర్మమునుండి దూరముకాదని అర్థం.

అధర్మపరుడైన రాజు ఎక్కువకాలం రాజ్య పాలన చేయజాలడు. 'అథ సంత్యజతో ధర్మమధర్మం చానుతిష్ఠతః। ప్రతిసంవేష్టతీ భూమిః అగ్నౌ చర్మాహితం యథా॥' (వి.నీ.2.29) ధర్మమును విడనాడి, అధర్మాచరణ చేయు రాజుయొక్క భూమి, అగ్నియందుంచిన చర్మంరీతిగా ముడుచుకుంటుంది. అనగా పృథ్వి విస్తరించదని అర్థం. మరియు, 'పితృపైతామహం రాజ్యం ప్రాప్తవాన్ స్వేన కర్మణా। వాయురభ్రమివాసాద్య భ్రంశయత్యనయే స్థితః॥' (వి.నీ. 2.27) తండ్రి తాతల రాజ్యమును పొందినవాడైనను, రాజు అధర్మప్రవర్తకుడైనచో, వాయు విజృంభణకు మేఘం చెదిరినట్లుగా, తనయొక్క కర్మచేత రాజు రాజ్యాన్ని పోగొట్టుకుంటాడు. 'గురురాత్మవతాం శాస్తా శాస్తా రాజా దురాత్మనామ్। అథ ప్రచ్ఛన్న పాపానాం శాస్తా వైవస్వతో యమః॥'(వి.నీ. 3.72) ఆత్మవంతులను గురువు, దుర్మార్గులను రాజు, రహస్యముగా పాపముల నాచరించువారిని యమధర్మరాజు శిక్షింతురని చెప్పుటలో, శాసించు అధికారం ధర్మమూర్తులకే అని సుస్పష్టం. అందువలననే రాజులు ఉత్తములను సేవించాలి.

ఉత్తములనగా నెవరు? మంచినడవడిక కలవారు, మన శ్రేయస్సును కోరువారు, ఉన్నత భావనంపద నుండువారు. అందుచేతనే 'యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ' ఎట్టి భావనయో అట్టి సిద్ధి కలుగునని చెప్పుచుందురుకదా! 'యాదృశైః సంనివిశతే యాదృశాం శ్చోపసేవతే। యాదృగిచ్ఛేచ్చ భవితుం తాదృగ్భవతి పూరుషః॥' (వి.నీ. 4.13) ఎటువంటివారితో సహవాసము చేయునో, ఎటి వారిని సేవించునో, ఎటువంటివాడుగా కావలెనని కోరుకొనునో, మనుజుడు అటువంటివాడే యగు ననుటలో సంశయములేదు. మంచి సహవాసం మంచికి దారి తీయటంకూడా కష్టమే. కొంతమంది ఎక్కడ ఉన్ననూ, ఎటువంటివారి సాంగత్యం చేసినా, ఎన్నివిన్నాకూడా అడిగేది అడుగుతూనే ఉంటారుకాని వారిలోమాత్రం ఏ విధమైన మార్పు కనిపించదు. దానికి ధృతరాష్ట్రుడే కనిపిస్తున్నాడుకదా మనకు! 'చెవిటివానిముందు శంఖు ఊదినట్లే' అనే సామెత యిక్కడ చక్కగా అతుకుతుంది. శ్రమతో తీవ్ర కృషి చేయాలి. కృషి ఫలిస్తేనే శాంతి లభ్యం.

రాజులకు పనికిరానివని బోధించినా కొన్ని లక్షణాలు మనుష్యులకుకూడా పనికిరానివిఉన్నవని విదురుడు సూచించాడు. అదే ద్యూతం. అనగా జూదం. 'ద్యూతమేతత్ పురాకల్పే దృష్టం వైరకరం నృణామ్। తస్మాత్ ద్యూతం న సేవేత హాస్యార్థమపి బుద్ధిమాన్॥' (వి.నీ.5.19) పూర్వం యీ జూదం రాజులలో విరోధాన్ని పుట్టించినది. కావున

బుద్ధిమంతుడైనవాడు హాస్యమునకైనను జూదము నాడరాదు. ఈ జూదముకొరకే కౌరవులు పాండవులను రప్పించి, శకుని మాటల విశ్వాసముంచి, మోసపు జూదముతో పాండవులను జయించి, వారి సర్వస్వమును దోచుకుని, ద్రౌపదిని పరాభవించి, పాండవులను కట్టుగుడ్డలతో అరణ్యావాసానికి పంపారు 13 సంవత్సరాలు. పాపం చేసేటప్పుడు మానవుడు ఆనందంగా ఉండి, 'నా అంతవాడు లేడు' అని భావిస్తాడు. కాని, ఆ పాపం అనుభవించవలసివచ్చినప్పుడు దుఃఖిస్తూఉంటాడు. ఇది మానవులకు అలవాటే. ధర్మాత్ములైన పాండవులను దూరం చేసికొనటం కౌరవులు చేసిన మొదటి తప్పు. అధర్మపరుడై, అవినీతికి పాల్పడి, వంచనతోనే సర్వంనాశనం గావించి, కౌరవుల వంశనాశనానికి కారణుడైన శనివంటి శకుని నాశ్రయించటం రెండవ తప్పు. కౌరవుల రాజ్యకాంక్ష, యీర్ష్యాసూయలు మూడవతప్పు. అందువలననే ధృతరాష్ట్రసంతానం సమూలంగా నాశనం అయింది.

ఈ జూదం, నాడే కాక నేడుకూడ ఉన్నది లోకంలో. మానవ బలహీనతల నాధారం చేసికొని దుర్గుణాలు విజృంభించి, మానవజీవిత నాశనానికి కారణం అవుతాయి. అంతేకాక దుర్గుణాలు అలవడినంత సులభంగా సద్గుణాలు కలుగవు. కొంతమంది, యింట్లో ఏమీతోచక, చతుర్ముఖ పారాయణం అనగా పేకాట ప్రారంభం చేస్తారు. ఎవరూ లేకపోతే ఒక్కరే తీరికగా ఆడుకుంటారు.

ఆవిధంగా ఆ దురలవాటును పెంచుకుంటారు. మంచి గ్రంథం చదువుకొనటం, పూజాజపాదికములను చేసుకొనటం, లలితా, విష్ణు సహస్రనామ పారాయణలు చేయటానికి ఒప్పుకోదు యీ మనస్సు. తోచక చేసిన పేకాట అలవాటు అవుతుంది. తర్వాత మెల్లగా నలుగురిని చేర్చుకుంటాడు ఆడుకోటానికి. ఆపై ఆ అలవాటు క్లబ్బులకు తీసుకొని వెళ్ళుతుంది. అంతటితో ఆగక, డబ్బు పెట్టి ఆడే అలవాటు కలుగుతుంది. ఇదేవిధంగా ఒక్క పేకాటకేకాక త్రాగుడుకు, యింకా అనేక యితర వ్యసనాలకు లొంగి, తన జీవితాన్ని, తన కుటుంబాన్ని, అటుపై స్నేహితుల, పరిచయస్థుల, బలహీనతలను గ్రహించి, వారి జీవితాలనుకూడా సర్వనాశనం చేస్తాడు. మానవుడీవిధంగా వ్యసనాలకు ఎందుకు బానిస అవుతాడు? వీడికి ఉన్న విచక్షణాజ్ఞానం ఏమైనట్లు? మంచిని బోధించేవారికి ఎందుకు దూరంగా తిరుగుతాడు? 'పరోపదేశవేళాయాం సర్వే వ్యాసపరాశరాః' పరులకుపదేశించు సమయాలలో వ్యాసపరాశరులరీతిగా ప్రవర్తిస్తారు కొంతమంది. ఆచరణలో మాత్రం శూన్యమే.

గృహస్థుకు మంచి భార్య, చక్కని సంతానం ఉన్నట్లు రాజుకుకూడా మంచి మంత్రి, మంచి సేవకులు, మంచి ప్రజలు ఉండాలి. అప్పుడు ఆ రాజవర్యుని యశశ్చంద్రికలు దేశమంతటా వ్యాపిస్తాయి. అందుచేతనే 'యథా రాజా తథా ప్రజా' అని చెప్పారు మన పెద్దలు. మంత్రిని

నిర్ణయించుకొనటంలో చాలా జాగ్రత్తగా ఉండాలి రాజు. అందువలన 'అపండితో వాపి సుహృత్ పండితో వాప్యనాత్మవాన్। నావరీక్ష్య మహీపాలః కుర్యాత్ సచివమాత్మనః॥' (వి.నీ.6.19) పాండిత్యం లేని స్నేహితుని, అనాత్మవంతుడైన పండితుని, రాజు మంత్రిగా చేసుకొనక చక్కగా పరీక్షించి, నిర్ణయించుకోవాలనియు, 'అమాత్రే హ్యర్థలిప్సా చ మంత్ర రక్షణమేవ చ।' (వి.నీ. 6.20) కార్యసిద్ధి, రహస్యవిషయ పరిరక్షణ బాధ్యతలు అమాత్యునిపై ఆధారపడియున్నవి కాన మంత్రి పదవి నిర్ణయంలో తగు జాగ్రత్త అవసరమనియు హెచ్చరిక జరిగింది. అదేవిధంగా మహారాజు 'అభిప్రాయం యో విదిత్వా తు భర్తుః సర్వాణి కార్యాణి కరోత్యతంద్రీ। వక్తా హితానా మనురక్త ఆర్యః శక్తిజ్ఞ ఆత్మేవ హి సోనుకంప్యః॥' (వి.నీ. 5.25) మహారాజుయొక్క మనోభావమును గ్రహించి, శీఘ్రముగ కార్యముల నిర్వహించువాడును, మంచిని చెప్పువాడును, అనురక్తుడును, సద్గుణుడును, శక్తిసామర్థ్యముల గ్రహించువాడును, స్వామి భక్తితత్పరుడైన సేవకునికూడ తగువిధమున గౌరవింపవలయును. ఇటువంటి మంత్రి, సేవక, పరిజనులతో, ప్రజల కష్టసుఖముల గ్రహించి, ఆ ప్రజల సుఖసంతోషములు తనవిగా భావించి, చక్కగా రాజ్యపరిపాలన గావించు ప్రభువు, అందరికి ఆదర్శంగా ఉంటాడని, రాజనీతిమర్మముల గ్రహించిన విదురుడు ధృతరాష్ట్రునికి వివరించాడు. ధృతరాష్ట్రుడు విదురుని మాటలయందలి

ధర్మప్రాశస్త్యాన్ని గ్రహించియే 'యతో ధర్మస్తతో జయః' అని పైకి చెప్పుకుంటాడు. ధర్మగుణంచేత మనుష్యులు ఉత్తములై, పూజాయోగ్యతను సంపాదించుకుంటారు. ధర్మహీనులైన దేవతలైనను పతనం చెందుతారుకదా! అందుచేతనే 'సమృద్ధాః గుణతః కేచిత్ భవంతి ధనతో పరే। ధనవృద్ధాన్ గుణైర్హీనాన్ ధృతరాష్ట్ర వివర్జయ। ' (వి.నీ. 7.8) సంపదలు ద్వివిధం. అవే ధన సంపద, గుణ సంపదలు. ధనాధికులను, గుణహీనులను పరిత్యజించుము అనియు, సద్గుణోపేతులైన పాండవులను దూరము చేసుకొనవలదనియు, పరరాజ్యకాంక్షతో నీచకృత్యములు చేయుటకు పాల్పడుచుండిన కౌరవులకు లొంగవలదనియు హితోపదేశం చేశాడు విదురుడు.

ఇక ధర్మతత్పరులైనవారిని సహృదయులు, సంస్కారవంతులు, భక్తితత్పరులు అనుసరిస్తారుకదా! అదేరీతిగా అధర్మపరుని వదలివేస్తారు. శివ పూజాదురంధరుడు, లంకేశ్వరుడు అయిన రావణుడు, శ్రీరామ పత్నియు, పతివ్రతాశిరోమణియు, జగన్మాతయునగు సీతామాతను, శ్రీరాముడు లేని సమయంలో, దొంగతనంగా లంకకు తీసుకుని రావటం అధర్మంకదా! ఇది తప్పు అని అందరికి తెలుసును. కాని ఒక్కరుకూడా యిది అధర్మం అనికూడా నివారించలేదు. ఒక్క విభీషణుడుమాత్రం నిర్భయుడై, అన్న ప్రవర్తనను నిరసించాడు. 'న పరదారాం గచ్ఛేత్' అనే వేదవాక్యాన్ని గుర్తు చేశాడు. తమ్ముడైన విదురుడు, అన్నయైన ధృత

రాష్ట్రునికి బోధించినట్లు తమ్ముడైన విభీషణుడుకూడా అన్నయైన రావణునికి హితము నుపదేశించాడు. కాని విదురుడు, ధృతరాష్ట్రుని, విభీషణుడు రావణుని మార్చలేకపోయారు. అయినా విదురుడు ధృతరాష్ట్రుని వదలక చివరివరకు ధర్మప్రబోధ చేస్తూనే ఉన్నాడు. విభీషణుడుమాత్రం రావణుని వదలి, ధర్మమూర్తియైన శ్రీరామచంద్ర ప్రభువు పాదపద్మాలను ఆశ్రయించి తరించాడు. ఇదివరకే శ్రీ కృష్ణపరమాత్మని అనుగ్రహాన్ని పొందగలిగిన మహాభక్తుడు విదురుడు. ఇక ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహ రాజ్యకాంక్షల మధ్య నలిగి పోయాడు. ధనవ్యామోహం, రాజ్యకాంక్ష, శకుని సహవాసం, వయోవృద్ధ, ధర్మవృద్ధ, జ్ఞానవృద్ధుల నగౌరవించుట అను అవలక్షణములతోకూడిన దుర్యోధనాదులు సమూలంగా నాశనం అయ్యారు. కావున మానవులు ధర్మహీనులు కారాదని, 'ప్రజ్ఞావృద్ధం ధర్మవృద్ధం స్వబంధుం విద్యావృద్ధం వయసా చాపి వృద్ధమ్। కార్యాకార్యే పూజయిత్వా ప్రసాద్య యః సంపృచ్ఛేన్న సముహ్యేత్ కదాచిత్॥ (వి.నీ. 8.23) వయోవృద్ధుని, విద్యావృద్ధుని, ధర్మవృద్ధుని, ప్రజ్ఞావృద్ధుని, స్వబంధువులను పూజించి, కార్యాకార్యముల వారి సలహాల గ్రహించిన వాడెన్నడును పొరపాటు చేయడని మహాత్ముల వాణిగదా!

రామాయణ, భారతముల వ్యక్తులలో నొక విశిష్టత గోచరిస్తుంది. తెల్లవారితే పట్టాభిషేకం శ్రీరామచంద్రునికి. కాని పట్టాభిషేకం జరుగకపోగా

అరణ్యవాసం సంప్రాప్తించింది శ్రీరాముడికి. రాజ్యం జ్యేష్ఠుడిదేకదా! అయినా పితృవాక్యపరిపాలనకోసం రాముడు అరణ్యప్రవేశం చేశాడు. అదేవిధంగా రాజ్యం, జ్యేష్ఠుడైన ధర్మరాజుదే. మోసపు జూదమని తెలిసియు, రాజమర్యాదను పాటించి, జూదంలో సర్వమును కోల్పోయినవారై పాండవులంతా అరణ్యవాసం చేశారు. కైకమ్మవరాలప్రకారం తనకే రాజ్యం సంక్రమించినా, ఆ రాజ్యాన్ని శ్రీరామచంద్రునికే అర్పించాడు భక్తితత్పరుడైన భరతుడు. అందువలననే భరతుడు అందరిచే పూజింపబడ్డాడు. ఇక తమ రాజ్యం కాకున్నా, అతివ్యామోహంతో దాన్ని తమదే యని భావించి, పాండవులకు ద్రోహం చేసి వెళ్లగొట్టారు కావున కౌరవులు అందరిచేత ద్వేషింపబడ్డారు. 'నిత్యో ధర్మః సుఖదుఃఖేత్వనిత్యే' (వి.నీ.8.13) ధర్మము నిత్యమనియు, సుఖదుఃఖములనిత్యములనియు, 'తస్మాత్తు పురుషో యత్నాద్ధర్మం సంచినుయాచ్ఛనైః' (వి.నీ. 8.18) అందువలన ప్రయత్న పూర్వకంగా ధర్మాన్ని మెల్లమెల్లగా పురుషుడు సంపాదించుకోవాలని విదురమహాశయుని ఆశయం.

అనేకవిధములుగా ధర్మాన్ని, అనేక కోణాలలోనుండి విశ్లేషించి వివరించాడు ప్రాజ్ఞుడైన విదురుడు. 'న తత్పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః। సంగ్రహేణైష ధర్మః స్యాత్ కామాదన్యః ప్రవర్తతే॥' (వి.నీ. 7.71) తనకు విరుద్ధమైనదానిని పరులకు చేయకుండుటయే ధర్మమనియు, ఇచ్ఛానుసారము ప్రవర్తించుట

అధర్మమనియు ఒక్క శ్లోకంలో ధర్మాధర్మములన గూర్చి ధృతరాష్ట్రనికి తెలియజేశాడు ధర్మతత్పరుడైన విదురుడు.

ఉత్తమలక్షణాలు కొన్ని జన్మతః రావాలి. వాటికి మెరుగుపెట్టుతుంది మహాత్ముల సేవ. సత్సంస్కారములతో, దుష్టసంస్కారములతో జనిస్తాడు మానవుడు. ఆ గుణాలు మానవుని బాల్యంనుండి బహిర్గతం అవుతూనే ఉంటాయి. వాటిని చక్కగా పరిశీలించి, మంచివాటిని అభివృద్ధి చేసికొని, చెడ్డవాటిని దూరం చేసుకోవాలిగదా! ఆ బాధ్యతలను స్వీకరించేవారుకూడా మంచివారుగా ఉండాలి. ఉత్తమకులంకూడా సహాయభూతం అవుతుంది. 'పృచ్ఛామి త్వాం విదుర ప్రశ్నమేతం భవంతి వై కాని మహాకులాని||' (వి.నీ. 4.22) 'విదురా! గొప్పకులం అంటే ఏమిటి? ఈ ప్రశ్నను అడుగుచున్నాను' అని ధృతరాష్ట్రుడు విదురుని ప్రశ్నించాడు. చక్కని పుష్పానికి సుగంధం తోడైనట్లుగా, ఉత్తమకులంలో జన్మించినవాడికి క్రమశిక్షణ ఉంటే, చక్కని సంస్కారాలు సుగంధంలాగా వ్యాపిస్తాయికదా! అందుచేత కేవలం ఉత్తమకులంలో పుట్టటమేకాక 'యేషాం న వృత్తం వ్యథతే న యోనిశ్చిత్తప్రసాదేన చరంతి ధర్మః| యే కీర్తిమిచ్ఛంతి కులే విశిష్టాం త్యక్తానృతాస్తాని మహాకులాని||' (వి.నీ. 4.24) స్థిర ప్రవర్తనతో, జననీజనకులకు సంతోషాన్నిస్తూ, నిర్మల హృదయంతో ధర్మాచరణ గావించి, వంశముయొక్క కీర్తిప్రతిష్ఠలకు కళంకము రానీయక, అసత్యమును

పలుకనివారుమాత్రమే ఉత్తమవంశసంజాతులని నిర్ణయం.

మనుష్యులు అస్థిరులని, ధర్మస్వరూపుడైన విదురుడు చక్కగా చెప్పాడు, ఆ అస్థిరత్వం వారి మనస్సులోని కోరికలవలన కలుగుతుంది. కామనలున్నవారు చంచలస్వభావులు. ఆ వాసనలతో, ఉన్న స్థిరత్వాన్ని పోగొట్టుకుంటాడు మానవుడు. ఇక స్థిరత్వం ఎక్కడనుండి వస్తుంది ? అందువలననే 'రాముడున్నచోట కాముడు ఉండడు. కాముడున్నచోట రాముడు ఉండడు' అను మాటలలో చాలా అంతరార్థం ఉన్నది. రాముడు భగవంతుడు. భగవంతుని పొందినవాని హృదయం ఆనందనిలయం. అట్టి హృదయంలో నిశ్చలత్వం ఉంటుంది. కాబట్టి నిశ్చలమైన ఆనందంలో చంచలమైన , లౌకికమైన కోరికలకు తావేది? అదేవిధంగా కోరికలు లౌకికం. కోరికలు అధికమైనవానికి సదా దుఃఖమే తాండవిస్తూ ఉంటుంది. మరియు కాంక్షలు చంచలమైనవి. కాన చంచలతతో దుఃఖితుడైనవాని హృదయంలో భగవంతుడు నివసించడని అర్థం. రామునితో ప్రశాంతి, కామునితో అశాంతికదా! రెండూ ఒక్కచోట ఉండటం అసాధ్యం.

ఇక యీ కామానికి అర్థం తోడైతే, అగ్నికి గాలితోడైనట్లు మానవజీవితం సర్వనాశనం. అందువలననే 'మా కురు ధనజనయౌవన గర్వం' ధనజన, యౌవన గర్వాన్ని పొందవద్దని మానవులకుపదేశించాడు భజగోవిందంలో శ్రీ

శంకరుడు. అట్లాగే 'అర్థమనర్థం భావయ నిత్యం' ఎల్లప్పుడూ అర్థాన్ని అనర్థంగా భావించాలి ఎవరు? యథార్థమైన ముముక్షువు భావించాలి. అతడు అత్యంతావసరప్రవృత్తినిమాత్రమే కలిగి ఉండాలి. **Is this essential for my spiritual growth** అని శ్రీ అనుభవానందస్వామి వచించినట్లు ఇది నా ఆధ్యాత్మికజీవితాభివృద్ధికి అవసరమా? అని ప్రశ్నించుకుని ముందడుగు వేస్తున్న సాధకుడు, తన వైరాగ్యనిధిని కాపాడుకుంటూ, మహాత్ముడు కావటం నిస్సంశయం. మరి గృహస్థులకు ధన మవసరమేగదా! కాని ధర్మమార్గంలో ఉండాలి సంపాదన. ధర్మార్జితం అనర్థమైన కోరికలను పుట్టించదు. ధర్మసంపాదన మానవుని అకృత్యములకు పాల్పడనీయక, దాన ధర్మములచేయు బుద్ధిని కలిగించి, మానవునికి ఉత్తమ జీవితాన్ని యిస్తుంది. అట్టివాడు నిగర్వియై తన సంపదను భగవ దనుగ్రహంగా భావిస్తాడు. కాని 'ఐశ్వర్యమద పాపిష్ఠామతాః పానమదాదయః! ఐశ్వర్యమదమత్తో హినాపతిత్వా విబుధ్యతే!!' (వి.నీ. 2.53) త్రాగుడు, మదము అను వానికంటే ధనమదమే గొప్పది. ఐశ్వర్యాహంకారి పూర్తిగా చెడినతర్వాతగాని తన తప్పును గ్రహించుకోడని విదురోక్తి. అందుచేతనే, 'ధనమూల మిదం జగత్' అని ధనాపేక్షులు, 'ధర్మమూలమిదం జగత్' అని ధర్మాత్ములు, 'మోక్షములమిదం జగత్' అని ముముక్షువులు, 'కామమూలమిదం జగత్' అని కామార్థులు వారి వారి సంస్కారానుగుణంగా పలికారు. ధనంమీద మానవునికున్న కాంక్ష భగవంతునిపై ఉండదుకదా!

అందుచేతనే 'యస్యాస్తి విత్తం న నరః కులీనః న పండితస్సశ్రుతవాన్ గుణజ్ఞః। న ఏవ వక్తా న చ దర్శనీయః సర్వే గుణాః కాంచనమాశ్రయంతి।' ధనవంతులను ఆశ్ర యించినవారు, ఆయన దుర్గుణములను బహిర్గతము కానీయక, ఆ ధనవంతుని ఉత్తముడనియు, కులీనుడనియు, పండితుడనియు, గుణవంతుడనియు, మహావక్త అనియు, ఆదర్శవ్యక్తి అనియు పొగుడుతూ ఉంటారు. అన్ని గుణములు ధనము నాశ్రయించి ఉంటాయని భర్తృహరి వచనం. ఈ విధమైన చిత్తచాంచల్యం, కామచాంచల్యం, మానసిక చాంచల్యం పొందు తున్నవాడికి, యిక స్థిరత్వం ఏది? స్థిరమనస్కునికే స్థిరప్రవర్తన అని అన్వయం.

తల్లిదండ్రులను బాధింపనివాడు అన్నారు. లోకంతీరు చూస్తే ఆశ్చర్యంగా వుంటుంది. సంతానం లేనివారు 'అయ్యో! లేరే' అని, ఉన్నవారు 'అయ్యో! వారు చూడటం లేదే' అని ఏడుస్తుంటారు. ఇరువురికి దుఃఖం సమానమే. మానవజీవితానికి తల్లిప్రేమ, తండ్రి శిక్షణ ఒక వరం. మాతృహీనుడైనవానికి తల్లి ప్రేమయందలి ప్రేమవాత్సల్యముల మాధుర్యం తెలియక, అందరిచేత చిన్ననాటినుండి ద్వేషింపబడి, కఠినుడిగా మారిపోతాడు. అదేవిధంగా పితృహీనుడు, క్రమశిక్షణారాహిత్యంచేత స్వతంత్రుడై, ఎవ్వరినీ లెక్కచేయక, చెడిపోయే అవకాశం ఉన్నది. అందువల్ల బాల్యంనుండి పిల్లలను జాగ్రత్తగా చూచుకుంటూ, బాధ్యతతో వారికి విద్యాబుద్ధుల

నేర్పించి, వివాహం గావిస్తారు ఆ తల్లిదండ్రులు. అంతవరకు సంతానం సర్వబాధ్యతలు తలి దండ్రులవే! ఇక తర్వాతి బాధ్యత, తల్లిదండ్రుల జీవితపర్యంతం వారి మనస్సుకు నొప్పి కలిగించక, వారిని ప్రేమతో చూచి, సేవించవలసినది సంతానానిది. వివాహం కాగానే తల్లిదండ్రులను వదలటంకాక, రోగగ్రస్థుడైన తండ్రిని చూడటానికి వచ్చినప్పుడు, 'నాన్నా'! ప్రస్తుతం బ్యాంకులో ఎంత ఉన్నది? మీ యిద్దరికి ఎక్కువ ఖర్చులే ముంటాయిలే! ఇల్లు అమ్మపేర వ్రాశావా ?' అని ప్రశ్నిస్తాడు పుత్రుడు. తన విద్యకు తండ్రి చేసిన సహాయం గుర్తుకు రాదు. ఇంకా అనేకవిధములుగా తండ్రి చేసిన సహాయం గుర్తుకు రాదు. ఎంత యిచ్చినా తృప్తి ఉండదేమో మరి! ఇకముందు వీరి సంతానంకూడా యిదే బాటలో ఉంటుంది. కాని తమకి జన్మనిచ్చిన తల్లిదండ్రులెటువంటివారైనా వారి ఋణం తీర్చుకోవాలి అని అర్థం.

మానవుడికి లోకంతో అనేక సంబంధా లున్నవి. ఆ సంబంధాలలో తనకున్న ధర్మాన్ని గ్రహించి, పుత్రునిగా, అన్నగా, భర్తగా, తండ్రిగా, యజమానిగా తన బాధ్యతలను సక్రమంగా నిర్వహించుకోవాలి. అదేవిధంగా తన వంశ గౌరవాన్ని నిలుపుకోవాలి. తన ప్రవర్తనతో వంశ కీర్తిప్రతిష్ఠలను అధికం చేసుకోవాలి. మానవునికి వంశం చాల ముఖ్యం. గృహస్థు తనవారికి వివాహం చేయాలంటే, అవతలివారి వంశం ఎటువంటిదో చూచి చేస్తాడు. అదేరీతి సరియైన

గురువుకూడ తనవద్దకు వచ్చినవారిని వంశవరంవర, లక్షణాలను చూచి చేర్చుకుంటాడు. మంచి వంశంనుండి వచ్చిన కోడలు మెట్టిన కుటుంబానికి కీర్తిని కలిగించినట్లు, ఉత్తమ వంశంనుండి వచ్చిన శిష్యుడుకూడ, ఉత్తమ భావాలతో గురుశుశ్రూష గావించి, ఉత్తమ సాధకుడై, ఉత్తమ సన్న్యాసియై ప్రకాశించి, తన పూర్వాశ్రమ వంశానికి, నేటి గురుసంప్రదాయానికి చక్కని కీర్తిప్రతిష్ఠలను అందిస్తాడు.

అదేవిధంగా సత్యం పలకటం ముఖ్య ధర్మం. పశుపక్ష్యాదులకు లేని వాక్కును మానవుడికి భగవంతుడు ప్రసాదించినందుకు వాక్కును పవిత్రం చేసుకోవాలి సత్యంతో. 'సత్యంవద' అని వేదం, మానవుని సత్యం పలకమని ఆదేశించింది. సత్యధర్మాలు రెండూ ఒక్కచోటనే ఉంటాయి. సత్యమున్నచోట ధర్మం, ధర్మం ఉన్నచోట సత్యం ఉండితీరాలి. అందుచేతనే అర్థకామాలుకూడా ఒక్కచోటనే ఉంటాయి. సత్య ధర్మాల జంటచే మానవునికి తృప్తి, ఆనందం లభిస్తాయి. అర్థకామాల జంట మానవునికి ఉన్న ఆనందాన్ని దూరం చేస్తాయి. సత్యధర్మద్వయాచరణలో నిష్ణాతులై, శాశ్వత కీర్తిని పొందినవారు హరిశ్చంద్రుడు, దశరథుడు, రామచంద్రుడు మున్నగువారు. 'రామో విగ్రహవాన్ ధర్మః' అని ధర్మస్వరూపునిగా పేరు పొందిన శ్రీరాముడు సత్యవాక్యపరిపాలన చేశాడుగదా!

మానవుడికి ఎన్నిసంపదలున్నా శీలసంపద

కీర్తిని తెస్తుంది. మహాత్ములకు శీలం చాలా ముఖ్యం. 'సర్వం శీలవతా జితం' (వి.నీ. 2.47) శీలవంతుడు సర్వమును జయిస్తాడు. మరియు 'శీలం ప్రధానం పురుషే తద్యస్యేహ ప్రణశ్యతి। న తస్య జీవితే నార్థో న ధనేన న బంధుభిః॥' (వి.నీ. 2.48) పురుషునికి ప్రధానమైనది శీలం. ఆ శీలం కోల్పోయినవాని జీవితానికి అర్థం లేదు. అటువంటి వానిని ధనం రక్షించలేదు. బంధువర్గంకూడా రక్షించలేరనునది అక్షరసత్యం. ఈనాడు, ఆ పవిత్రమైన శీలం లోపించింది. మొదటి కారణం, మన భారతీయసంస్కృతిలో గల అంతరార్థాలను గ్రహించకపోవటం. రెండవ కారణం, విదేశీయ సంస్కృతీ వ్యామోహం. తల్లిదండ్రుల ప్రవర్తనలు, అర్థ కామ విషయపరమైన గ్రంథముల చదవటం, టెలివిజన్‌లలో అనేక అనవసర కార్యక్రమాలను తిలకించటంచేత దుష్టభావములు మనస్సులో దృఢమై, మానవుల మనస్సులను మలినం చేస్తున్నవి. నాగరికత పేరుతో స్వేచ్ఛగా తిరగటం అలవాటైనది. ఇందులో చిన్నపెద్ద, స్త్రీపురుష తారతమ్యం కనిపించటం లేదు. శారీరకబలంకంటే శీలానికి బలం అధికం. ఆ శీలసంపదే మనిషికి శక్తిని, తుష్టిని, పుష్టిని యిస్తుంది. భక్తిజ్ఞానాలను కలిగిస్తుంది. 'సత్యం రూపం శ్రుతం విద్యా కౌల్యం శీలం బలం ధనమ్। శౌర్యం చ చిత్రభాష్యం చ దశేమే స్వర్గయోనయః॥' (వి.నీ. 3.60) సత్యవచనం, రూపసంపద, మంచి విద్య, శాస్త్రజ్ఞానం, ఉత్తమ వంశజననం, చక్కని శీలం, మంచి బలం, ఐశ్వర్యం, పరాక్రమం, యుక్తితో

కూడిన మాటలు అను నీ దశకం స్వర్గహేతువులని విదురుని విశేష ప్రబోధం.)

అందరికీ విద్య అవసరం. కాని ఆ విద్యాసారాన్ని మనసా గ్రహించి, దాన్ని బహువిధముల మలచి, ప్రజలకు అందించువాడు పండితుడు. ఆ పండితునికైనను సత్సంస్కారములే పునాది. 'క్షిప్రం విజానాతి చిరం శృణోతి విజ్ఞాయ చార్థం భజతే న కామాత్। నాసంపృష్టోవ్యుపయుంక్తే పరార్థే తత్ప్రజ్ఞానం ప్రథమం పండితస్య॥' (వి.నీ. 1.22) శీఘ్రంగా విషయగ్రహణం, జ్ఞాన దృఢత్వంయ కోసం ఎక్కువగా శ్రవణసమయమును పెంచుకొనటం, నిష్కామ సేవ, అడగనిదే ఉపదేశాలు చేయకుండటం అనేవి పండితవర్యుని గుణగణములు. 'అనసూయార్జవం శౌచం సంతోషః ప్రియవాదితా। దమః సత్యం అనాయాసో ...'(వి.నీ. 2.72) అసూయ లేకుండుట, ఆర్జవం, శుచిత్వం, సంతోషం, ప్రియవచనం, ఇంద్రియనిగ్రహం, సత్యం, నిశ్చలత్వం అనునవి మానవ ప్రశాంతి జీవనకారణములు. ఈర్ష్యా సూయలు జలగలవలె మనిషిని పీల్చి పిప్పి చేసి, అశాంతిని నెలకొల్పి, సర్వానర్థముల కలిగించును. అశాంతియే వానికి సర్వత్ర గోచరించును. కాన యీ అసూయను దరిచేరనియ్యనివాడు ముమ్మాటికి ధన్యుడు.

ఆర్జవం, నిరాడంబరత రావాలి. భగవంతుని యథార్థంగా గ్రహిస్తే ఆడంబరాలు తగ్గిపోతాయి. ఆడంబరాలలో వస్తువులపై అభిలాష పెరుగుతుంది. ప్రాపంచికత పెరిగిపోతుంది. లౌకికం ఎక్కువ

అయితే దైవానికి దూరం అవుతారు. కాన ఆడంబరాలు తగ్గాలి. నిరాడంబరతలో ప్రసన్నత ఉంటుంది. అవసరాలు తగ్గితే ఆడంబరాలు తగ్గుతాయి.

శుచి అనగా పరిశుభ్రత అని అర్థం. ప్రతిదినం బాహ్యశుద్ధి జరుగుతుంది, శరీరానికి స్నానాదులతో. కాని అంతఃకరణశుద్ధికి మంచి లక్షణాలు ఏర్పడాలి. ఆ సల్లక్షణాలు జీవనదిలాగ ప్రవహించాలి. అంతఃశుద్ధివలన ఆధ్యాత్మిక సిద్ధి తప్పక కలిగి తీరుతుంది. ఇక సంతోషం. అంతఃశుద్ధిచేత సంతోషం ప్రాప్తిస్తుంది. ప్రాపంచిక కల్మషాలు లేనివాడికి సంతోషం. సంతోషం, ఆనందం హృదయానివి. సుఖందుఃఖం మనస్సువి. నిత్య సంతృప్తునికి ఎల్లప్పుడూ సంతోషమే. 'ప్రాపంచిక జీవితంలో తృప్తి, ఆధ్యాత్మిక జీవితంలో అసంతృప్తి కలగాలి' అంటాడు శ్రీ వివేకానంద స్వామి. అప్పుడు సంతోషం చక్కగా తెలియ బడుతుంది. సంపాదించిన దానితో తృప్తిలేక, చూచినవన్నీ కావాలనే కోరికలకు దాసుడై, ఆ కోరికలను తీర్చుకోటానికి లంచాలను తీసుకుని, అది చాలక మోసం చేయగలిగినంతవరకు చేసి, ప్రాపంచికజీవితంలో సంతృప్తిలేనివాని దరిదావులకు రాదు యీ సంతోషం. కాని నేడు 'ప్రాపంచిక జీవితంలో అసంతృప్తి, పారమార్థిక జీవితంలో తృప్తిని' పొందుతున్నారు. యథార్థమైన సంతోషంలో కఠినత్వం ఉండదు. ముఖంలో చిరునవ్వు తొంగి చూస్తుంటుంది. మాటలో ప్రేమవాత్సల్యాలు

ప్రవహిస్తాయి. వాక్కుకు మాధుర్యం సిద్ధిస్తుంది.

ఇక యింద్రియనిగ్రహం. తెల్లవారి లేచినప్పటినుండి రాత్రి నిద్రించేవరకు, యీ నాటి మానవుల యింద్రియాలకుగాని, మనస్సుకుగాని విశ్రాంతి లేదనియే గట్టిగా చెప్పవచ్చును. శబ్దకాలుష్యం, దృశ్యకాలుష్యం పెరిగాయి. అనవసరపు ఆలోచలనతో మనస్సు తీవ్రంగా పని చేస్తుంటే ఉద్రేకాలు పెరిగి, రక్తపోటు, గుండెనొప్పులు వస్తున్నాయి. ఇంకా తీవ్రం అయి వైద్యులకు లొంగని అనేక కొత్త వ్యాధులుకూడా తయారవుతున్నాయి. ఇంకా పెరిగితే, ఆ ఉద్రేకంలో ఖూనీలు చేయటానికికూడా వెనుదీయని క్రూర భావాలు మనస్సులో విజృంభిస్తున్నాయి. రజోగుణం బాగా వ్యాపిస్తున్నది. సత్త్వగుణ సంపద తరిగిపోతున్నది. ఈ విధంగా ప్రపంచమంతా కల్మషంతో నిండి ఉంటే యిక యింద్రియనిగ్రహం ఎక్కడ? ఇంద్రియనిగ్రహంలో ఉచితానుచితజ్ఞానం ఉంటుంది. ఇంద్రియనిగ్రహంలో తొందరపాటుదనం ఉండదు. అందువలన యింద్రియనిగ్రహం అత్యవసరం.

సత్యం పలకాలి. సత్యాన్ని పాటించినవారు సత్స్వరూపులై, సత్పురుషులయ్యారు. మానవ జీవితంలో 'సత్యం వద' అనేవాక్యానికి చాల ప్రాముఖ్యత ఉన్నది. నేటివారు 'సత్యం వద' అని పలకటంకాక 'సత్యం వధ' అని పలుకుతుంటారు. లేనిదానికి పత్తులు పెట్టటం, ఉన్నదానికి తీసి వేయటం నేడు సామాన్యం అయింది. కారణం

మన మాతృభాషను మనం మరిచిపోవటం, తెలుగు చదవటం రాకుండటం, తెలుగు వ్రాయటం అసలు రాకపోవటం. 'సత్యం వద' అని పలుకుతూ సత్యస్వరూపుడైన భగవంతునికి దూరమై, అనిత్య సుఖాలకు ప్రాకులాడుతున్నాము. సత్యంకొరకు తమ ప్రాణాలను త్యాగం చేసినవారు మన పెద్దలు. ఈ సత్యపాలనంవల్ల వాక్సంయమనం సిద్ధిస్తుంది. ఒకసారి శ్రీరామకృష్ణ పరమహంసదేవుడు ఒకరోజు ఒక భక్తునింటికి వస్తానని మాట యిచ్చాడు. కాని ఆ దినం దక్షిణేశ్వరానికి అనేకమంది భక్తులు వచ్చి, ఆ మహనీయుని దర్శించి, ఆ అనుభవమూర్తి మధురవాగమృతాన్ని గ్రోలుతూ, ఆయన దివ్య సమాధిసంస్థితులను కళ్లారా గాంచుతున్నారు. రాత్రి అయింది. భక్తులందరు వెళ్లారు. అప్పుడు శ్రీరామకృష్ణునికి' తాను భక్తునితో చెప్పిన మాట గుర్తుకు వచ్చింది. చాలా బాధ చెందాడు. సమయం రాత్రి పది అయింది. ఆ సమయంలో కలకత్తాకు బండి దొరకలేదు. అయినా గురుదేవుడు నడిచి కలకత్తాకు వెళ్లాడు. ఆ భక్తునింటికి వెళ్లి తలుపుకొట్టాడు. గాఢనిద్రలోనున్న వారు తలుపు తీయలేదు. తన రాకను, తాను వచ్చిన సమయాన్ని తెలియజేసి, వారింటి తలుపుపై వ్రాసి, చేవ్రాలు పెట్టి తిరిగి దక్షిణేశ్వరం చేరుకున్నాడు రామకృష్ణుడు. ఆవిధంగా సత్యాన్ని అనుసరించాడు కాబట్టి జగన్మాత, భవతారిణి, ప్రేమమయి అయిన కాళికాదేవి అనుగ్రహానికి పాత్రుడయ్యాడు రామకృష్ణుడు. వాక్కుతో పలకటమేకాక ఆచరణలోకూడా సత్యదీక్ష సాగాలి. పైవిధంగా

సద్గుణాలన్నీ ఒకదానివెంట ఒకటి చేరి, సకల సల్లక్షణోపేతుడు అవుతాడు పండితుడు.

అన్నిగుణములకంటె శ్రేష్ఠమైనది క్షమా గుణం, సత్యం పలికినవానికి వాక్కు వశంలో ఉంటుంది. ప్రియమైన మాట అందరికి ఆనందాన్ని యిస్తుంది. 'ప్రియవాక్యప్రదానేన సర్వే తుష్యంతి జంతవః। తస్మాత్ తదేవ వక్తవ్యం వచనే కా దరిద్రతా॥' ప్రియమైన వాక్యములవలన జంతువులు ఆనందిస్తాయి. అందువలన అట్టి వాక్కునే పలకటం మంచిది. వచనదారిద్ర్యం దేనికి? అని రామాయణంలోని శ్లోకం. అందువల్లనే 'లక్ష్మీర్వసతి జిహ్వాగ్రే 'జిహ్వాగ్రే మరణం ధ్రువం' జిహ్వాగ్రమునందు లక్ష్మి వసించవచ్చును, లేక మరణం సంభవించవచ్చునను సూక్తి యథార్థమేగదా। క్షమాగుణం వాక్సంయమనానికి తోడ్పడుతుంది. 'క్షమా గుణవతాం బలం' (వి.నీ. 2.75) అనియు, 'క్షమాహి పరమం బలం' (వి.నీ.1.49) గుణవంతులకు క్షమయే పరమ బలమనియు, 'శక్తానాం భూషణం క్షమా'(వి.నీ. 1.49) శక్తివంతులకు క్షమయే అలంకారమనియు, 'క్షమైకా శాంతిరుత్తమా' (వి.నీ.1.52) క్షమ ఒక్కటే ఉత్తమమైన శాంతి అనియు, 'క్షమా వశీకృతిర్లోకే' (వి.నీ.1.50) లోకమున అన్నియు క్షమకు వశీభూతమగుచున్నవనియు, ఓర్పు ఎంత గొప్పదో వివరింపబడినది. మరియు 'శాంతి ఖడ్గః కరే యస్య దుర్జనః కిం కరిష్యతి। అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి॥' (వి.నీ.1.50, 51) 'శాంతి ఖడ్గః' అనుచోట 'క్షమా శస్త్రం' అనే మాటకూడా

ఉపయోగింపబడినది. అనగా శాంతి యను ఖడ్గమును ధరించినవానిని దుర్జనుడేమియు చేయలేడు. గడ్డిలేనిస్థలములో పడిన అగ్ని తనంతతానే ఉపశమించినట్లు క్షమాగుణ సంపన్నునినుండి దుష్టుడే వైఢొలగునని అర్థం. కావుననే 'ఆక్రోశపరివాదాభ్యాం విహింసంత్యబుధా జనాన్। వక్తా పాపముపాదత్తే క్షమాగుణో విముచ్యతే॥' (వి.నీ. 2.74) (కఠిన వాక్కు, నిందించుబుద్ధిగల జ్ఞానహీనులు జనులను హింసింతురు. కాని ఆ పాపము, పలికిన వానినే చేరి, క్షమాగుణయుతుని దరికి చేరదనుట యథార్థమే.)

ఒకసారి, ఒక వృక్షచ్ఛాయను ప్రశాంతంగా ఆసీనుడై ఉన్నాడు అహింసావతారమైన బుధా భగవానుడు. భిక్షులు ఆయనను సమీపించి, 'గురుదేవా! మేము బయటకు వెళ్లినప్పుడు అనేకమంది మమ్ములను దూషిస్తుంటారు. అప్పుడు మేము ఏమి చేయాలి? ' అని ప్రశ్నించారు. శాంతమూర్తియైన బుద్ధదేవుడు ప్రశాంతవదనంతో, మెల్లగా 'నాయనలారా! మీరు భిక్షార్థం ఒక గృహస్థు యింటికి వెళ్లి భిక్షను అడుగుతారుగదా! మీ మాటను విని, ఆ యిల్లాలు లోనికి వెళ్లి, పదార్థాలు తీసుకొని రావటం ఆలస్యం అయింది. మీరు మరొకచోటికి వెళ్లారు. అప్పుడు ఆ తల్లి తెచ్చిన పదార్థాలు ఎవరికి చెందుతాయి?' అని అడిగాడు. 'ఆ పదార్థాలు తీసుకొనివచ్చినవారికే చెందుతాయి' అన్నారు శిష్యులందరూ ఒకేసారి. బుద్ధుడు చిరునవ్వు నవ్వుతూ 'భిక్షులారా! అదే

విధంగా దూషించినవారి దూషణలు మీరు తీసుకోకుంటే అవి ఎవరికి చెందుతాయి?' అనగానే 'వారికే చెందుతాయి' అని శిష్యులు బదులు పలికారు. అంత బుద్ధుడు 'ఇక మీరు బాధ పొందటం ఎందుకు? ప్రశాంతంగా జీవించండి' అని శిష్యులకు బోధించాడు. ఎంత చక్కని ఉపదేశం! క్షమాగుణం వశం చేసుకున్న వానికే యిది సాధ్యం!

లోకమున అనేకవిధములైన బలములు ఉన్నవి. 'హింసా బలమసాధూనాం' (వి.నీ. 2.75) దుర్జనులకు హింసయే బలమనియు, 'తపోబలం తాపసానాం బ్రహ్మ బ్రహ్మవిదాం బలం' (వి.నీ. 7.69) తాపసులకు తపస్సు, బ్రహ్మజ్ఞానులకు బ్రహ్మము బలములై యున్నవి. అదేవిధంగా వాక్కుకు మౌనం బలం అని చెప్పుకోవాలి. అందువలననే మౌనంతో ఉండి, వాక్కును స్వాధీనపరచుకున్నవారిని మునులు అన్నారు. వాక్కు సత్య, మౌన, తపస్సులతో పునీతం అయినప్పుడు, ఆ వాక్కుకు అమోఘమైన శక్తి లభిస్తుంది. ఆ శక్తిని రజోగుణసంపన్నుడు ఆగ్రహానికి ఉపయోగిస్తాడు. అదే శక్తిని సత్వగుణాధిక్యత కలవాడు సర్వులను అనుగ్రహించటానికి ఉపయోగిస్తాడు. కావుననే 'వాక్సంయమో హినృపతే సుదుష్కరతమోమతః,' (వి.నీ.2.76) ఓ ధృతరాష్ట్రా! వాక్కును నిగ్రహించటం చాలా కష్టమని విదురుడు ధృతరాష్ట్రునికి బోధించాడు. మరియు 'అభ్యావహాతి కల్యాణం వివిధం

వాక్సుభాషితా' (వి.సి. 2.77) చక్కగా పలికినమాట శుభమును కలిగిస్తుందికదా! బలహీనుడు, శక్తిహీనుడై ఎవరినీ ఏమీ చేయలేక మౌనం వహిస్తాడు. కాని సర్వవిధముల బలవంతుడైయుండియు ఎవరికీ అపకారం కలిగించకుండటం అంతసులభం కాదు.

దక్షిణేశ్వర కాళీదేవాలయాన్ని నిర్మించిన రాణీ రాస్మణీ అల్లుడైన మధురనాథుడు, ఒకసారి శ్రీరామకృష్ణుని తనయింటికి ఆహ్వానించాడు. శ్రీ రామకృష్ణుడు వచ్చిన తర్వాత మధురుడు ఆయనతో సంభాషించి, లోనికి వెళ్లాడు. మధురుని యింటి పూజారియైన చంద్రహల్దార్ శ్రీరామకృష్ణుని మెల్లగా సమీపించాడు. శ్రీ రామకృష్ణుడు భక్తితన్మయత్వంలో మునిగి ఉన్నాడు. ఈర్ష్యాసూయలతో దహించుకు పోతున్న అతడు రామకృష్ణుని చూచి,'మధురనాథుని ఏవిధంగా వశం చేసుకున్నావో చెప్పు. తన సర్వస్వం నీకు అర్పించటానికి సంసిద్ధుడై, నిన్నే ఆరాధించటానికి కారణం ఏమిటి?' అని అంటూ, కోపంతో శ్రీరామకృష్ణుని వీపుపై కొట్టి, బాధించివెళ్లాడు. శ్రీరామకృష్ణుడు ఒక్క మాటకూడ పలుకలేదు. కొంతకాలం గడిచిపోయింది. ఒకనాడు మధురుడు దక్షిణేశ్వరం వచ్చి, శ్రీరామకృష్ణునితో ప్రసంగిస్తూ 'మా పూజారి చంద్రహల్దార్ కొన్ని తప్పులు చేయటంచేత అతనిని యీదినం పనిలోనుండి తీసివేశా'నని చెప్పాడు. అప్పుడు శ్రీరామకృష్ణుడు ఆ పూజారి తనను కొట్టిన విషయాన్ని మధురుడుకి చెప్పాడు. వెంటనే మధురనాథుడు కోపావేశంతో 'బాబా! నాకు

అప్పుడే చెప్పితే వెంటనే అతడిని శిక్షించేవాడిని' అన్నాడు. శ్రీరామకృష్ణుడు మధురుని చూస్తూ, 'అప్పుడు నీకు చెప్పితే తొందరపడి, అతనికి అపకారం చేస్తావు. ఇప్పుడైతే నీకు చెప్పినా భయంలేదని చెప్పాను' అని నవ్వుతూ సమాధానం చెప్పాడు. అందుకే రామకృష్ణునికి దాసోహం అన్నాడు మధురుడు. అందుచేతనే 'అప్యపకారిషు య సాధుః స సాధుః సద్భిరుచ్యతే' అపకారుల యందు సాధుత్వమును చూపువాడే సాధువని, సత్పురుషుడని నిర్వచనం.

ఈ మనోనిగ్రహం, సర్వేంద్రియ నిగ్రహం అనేవి మాటలతో వచ్చేవికావు. దానికొరకు ఎంతో కృషి చేసి సాధించాలి. 'అక్రోధేన జయేత్ క్రోధం అసాధుం సాధునా జయేత్। జయేత్ కదర్యం దానేన జయేత్ సత్యేన చానృతమ్॥' (వి.నీ. 7.72) శాంతముతో క్రోధాన్ని, మంచితో చెడును, దానంతో లోభిని, సత్యంతో అసత్యాన్ని జయించమని సాధనా ప్రక్రియనుకూడ బోధించాడు విదురుడు. ఇదే శ్లోకాన్ని శ్రీ బుద్ధభగవానుడుకూడ కొద్ది మార్పులతో 'అక్కోధేన జినే కోధం అసాధుం సాధునా జినే। జినే కదరియం దానేన సచ్చేన అలికవాదినమ్॥' అని ధమ్మపథంలో, పాలీభాషలో పలికాడు. మహాత్ముల ప్రబోధాలు సర్వకాలముల, సర్వావస్థల, సర్వమానవాళికి శిరోధార్యములేకదా! మరియు ఆచరణీయములేకదా! అందువలన అట్టి మహనీయులను ద్వేషించి, దూషించిన మూఢులను గురించి 'ఆక్రుశ్యమానో నాక్రోశేన్మన్యురేవ

తితిక్షతః। అక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విందతి॥, (వి.సీ. 4. 5) క్షమాశీలుడు తనను తిట్టినవానినైనను శపించకూడదు. ఆ పావం దూషించినవానినే నాశనం చేస్తుంది. తిట్టినవానికున్న పుణ్యం తితిక్షావంతునకు చేరుచున్నదనుటలో మహాపురుషుల ద్వేషించుటచే కలుగు అనర్థం. మహాత్ముల ఔన్నత్యంకూడ యీ శ్లోకం చక్కగా ఉపదేశించింది.

పండితులనగా కేవల శాస్త్రజ్ఞానమేకాక, ధర్మాచరణ కలిగినవారుగాకూడా ఉండాలి. (రామాయణము చదివి, అందలి సత్యధర్మాలను, ఏకపత్నీవ్రతాన్ని, మాతాపితృభక్తిని, భ్రాతృవాత్సల్యాలను నిజజీవితంలో పాటించనప్పుడు ప్రయోజనం ఏమున్నది?) అదేవిధంగా భారతంలోగల పాండవుల ఐకమత్యం, ధర్మతత్పరతలు, విదురుని నిష్కామస్థితికి ప్రయత్నం చేయాలి. మరియు భాగవతమునందలి భక్తివిశేషముల గ్రహించి, భగవంతుని ధ్యానం అలవాటు చేసుకోవాలి. అందుచేతనే కేవల పాండిత్యంలో యీర్ష్యాసూయలు విజృంభించి, అవసరమైనచోట సహజగుణం బహిర్గతమై, విమర్శలకు గురికావడం మానవులకు తటస్థిస్తూ ఉంటుంది. కాబట్టి పండిత - పామరులకు, చిన్న పెద్దలకు, విద్యార్థి ఉపాధ్యాయులకు, నాయకులు ప్రజలకు, గురు - శిష్యులకు, సామాన్యులకు సన్యాసులకు, మహారాజులకు సేవకులకు అందరికికూడా ధర్మంతోకూడిన యింద్రియనిగ్రహం అత్యవసరం అని చెప్పకతప్పదు. అప్పుడు అందరి

జీవితాలలో ఆనందం తాండ విస్తుంది. చేయవలసిన పుణ్యకర్మలు చేయటం చేస్తే చాలు, దుష్కర్మలు వాటంతటవే దూరం అవుతాయి. 'పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిః పుణ్యస్థానం స్మ గచ్ఛతి। తస్మాత్ పుణ్యం నిషేవేత పురుషః సుసమాహితః॥ ' (వి.నీ. 3. 64) పుణ్యమును గావించుచు, పుణ్యాత్ముడై, పుణ్యస్థానమును పొందును. కాన సమాహిత చిత్తుడైన పురుషుడు ఎల్లప్పుడు, పుణ్యమునే సేవించవలయుననియు, 'పుణ్యం ప్రజ్ఞాం వర్ధయతి క్రియమాణం పునః పునః। వృద్ధ ప్రజ్ఞః పుణ్యమేవ నిత్యమారభతే నరః ॥' (వి.నీ. 3. 63) సదా పుణ్యాచరణచేయువానికి ప్రజ్ఞ అభివృద్ధి గాంచును. ఆ ప్రజ్ఞచేతనే మరల మరల పుణ్యమునే చేయుచుండుననియు, అట్టి పుణ్యాత్ముడు 'పుణ్యం కుర్వన్ పుణ్యకీర్తిఃపుణ్యమత్యంతమశ్నుతే' (వి.నీ. 3.61) పుణ్యకర్మ యొనరించుచు, పుణ్యమైన కీర్తినార్జించి, అధికమైన పుణ్యఫలితమును పొందుచున్నాడు. అదేవిధంగా పాపకర్మ చేయుటచే, దానివలన దుష్ఫలితాలు కలిగి, దుఃఖం వస్తుంది. 'పాపం కుర్వన్ పాపకీర్తిః పాపమేవాశ్నుతే ఫలం ' (వి.నీ. 3.61) పాప కృత్యముల చేయుచు, పాపిగా పేరును పొంది, పాప ఫలమునే పొందును. మరియు 'పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః। నష్టప్రజ్ఞః పాపమేవ నిత్యమారభతే నరః॥ ' (వి.నీ. 3.62) పాపాచరణ గావించినవానికి బుద్ధి నశించుచున్నది. బుద్ధిహీనుడై మరల మరల పాపమునే ఆచరించుచుండును. 'తస్మాత్ పాపం న కుర్వీత పురుషః శంసితవ్రతః' (వి. నీ. 3.62) అందువలన

దీక్షాతత్పరుడైన పురుషుడు పాపమును చేయరాదనియు, పుణ్య పాపలక్షణాలను, వాటి పరిణామాలనుతెలియజేశారు. ఉత్తమ బుద్ధి కలగటానికి 'ఉత్తమానేవ సేవేత' (వి. నీ. 4.20) ఉత్తములనే సేవించమనికూడా ఆదేశించింది.

అందువలన 'తత్త్వజ్ఞః సర్వభూతానాం యోగజ్ఞః సర్వకర్మణామ్। ఉపాయజ్ఞో మనుష్యాణాం॥' (వి.నీ. 1.27) సమస్తభూతములయొక్క తత్త్వగ్రాహకుడును, సర్వకార్యములయందలి కుశలత్వమును, ఉపాయముల గ్రహించుటలో నేర్పరియును, 'నిషేవతే ప్రశస్తాని నిందితాని న సేవతే। అనాస్తికః శ్రద్ధధానః। ' (వి.నీ.1.16) ప్రశస్త కర్మాచరణం, తద్విరుద్ధకర్మముల చేయకుండటం, నాస్తికుడు కాకుండటం, అనగా భగవద్భక్తి, విశ్వాసం కలవాడు కావటం, 'న హృష్యత్యాత్మసంమానే నావమానేన తవ్యతే। గాంగో హ్రద ఇవాక్షోభ్యో॥' (వి.నీ.1.26) సన్మానములకు పొంగక, అవమానములకు క్రుంగక నిశ్చలంగా నుండటం, 'ఆత్మజ్ఞానం సమారంభ స్తితిక్షా ధర్మనిత్యతా' (వి.నీ.1.5) ఆత్మజ్ఞాన సంపన్నుడు, క్షమాగుణసంశోభితుడు, ధర్మనిరతుడు అయినవాడే పండితుడని పండిత లక్షణములు ప్రబోధింపబడినవి. పైరీతిగ సర్వసల్లక్షణములతో ప్రకాశించు విజ్ఞుల నాశ్రయించి, 'అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః। చత్వారి సమ్ప్రవర్ధంతే కీర్తిరాయుర్యశోబలమ్॥' (వి.నీ. 7.74) పెద్దలకు వందనము గావించి, వృద్ధులను సేవించువారికి, కీర్తి, ఆయుష్షు, యశస్సు, బలం అను నాలుగు

లక్షణాలు అభివృద్ధి పొందుతాయి. అట్టివారివద్ద అభ్యసించిన విద్యయే వివేకాన్ని ప్రసాదిస్తుంది. 'విద్యైకా వరమా తృప్తిః' అట్టి విద్యయే పరమమైన తృప్తినిస్తుందిగదా!

ఇంతవరకు పండితుల, సత్పురుషుల లక్షణాలనేకం బోధింపబడ్డవి. ఇక దుర్జనుల గుణాలనుకూడా గ్రహించాలిగదా! మంచిలక్షణాలను అలవాటు చేసుకోటానికి, చెడులక్షణాలను దూరం చేసుకోటానికి దీన్ని వినియోగించుకోవాలి. 'హింసా బలమసాధూనాం' (వి. నీ. 2.75) హింసయే దుర్జనులకు బలమని భావం. కాని ఆ హింసయే శాపంగా మారినట్లు మన పురాణాల్లో ఎన్నో కథలున్నవి. అవి అసత్యములు కావు, యథార్థమే. 'విద్యాశీల వయోవృద్ధాన్ బుద్ధివృద్ధాంశ్చ భారత। ధనాభిజాతవృద్ధాంశ్చ నిత్యం మూఢోవమన్యతే।। ' (వి.నీ. 6.34) విద్యావృద్ధులను, శీలవంతులను, వయోవృద్ధులను, ధనవంతులను, కులవృద్ధులను, నిత్యం మూఢుడు అవమానిస్తూ ఉంటాడు. 'అకామాన్ కామయతి య కామయానాన్ పరిత్యజేత్। బలవంతం చ యో ద్వేష్టి' (వి.నీ.1.32) కానివారిని చేరదీయుట, అయినవారిని పరిత్యజించుట, బలవంతుని ద్వేషించుట, 'అమిత్రం కురుతే మిత్రం మిత్రం ద్వేష్టి హినస్తి చ। కర్మ చారభతే దుష్టః' (వి.నీ. 1. 33) ద్రోహిని మిత్రునిగా చేసికొనుట, మిత్రుని ద్వేషించి, హింసించుట, దుష్టకార్యము నాచరించుట, 'అవిశ్వస్తే విశ్వసితి' (వి. నీ. 1.36) నమ్మదగనివారిని నమ్మటం,

'హారణం పరస్వానాం పరదారాభిమర్శనమ్।
సుహృదశ్చ పరిత్యాగః' (వి.నీ.1.65)
పరధనాపహారణం, పరభార్య స్పర్శనం, సహృదయ
పరిత్యాగం, 'దేశద్రవ్యవినాశేన బ్రహ్మస్వహరణేన
చ' (వి. నీ. 4.26) దేవతా ధనమును
నశింపజేయుట, బ్రహ్మవిదుల విత్తమును హరించుట,
బ్రాహ్మణానాం పరిభావాత్ పరవాదాచ్చ భారత।'
(వి.నీ. 4.27) బ్రాహ్మణుల హింసించుట,
నిందించుట, 'అతిమానోఽతివాదశ్చ తథాఽత్యాగో
నరాధిప। క్రోధశ్చాత్మవిధిత్సా చ మిత్రద్రోహశ్చ॥'
(వి. నీ. 5.10) అతిగర్వము, అతివాగుడు,
మహాపాపముల చేయుట, కోపముతో నుండుట,
తన సుఖమునుమాత్రమే చూచుకొనుట, మిత్ర
ద్రోహమొనరించుట మొదలగునవన్నియు
అవలక్షణములేగదా!

పై విషయాలనే, శ్రీమద్భగవద్గీతలో,
శ్రీకృష్ణభగవానుడు దైవాసురసంపద్విభాగయోగంలో,
దైవసంపద అసురసంపదలుగా వివరించి చెప్పాడు
అర్జునుడికి. ఈ అసుర, అనగా ధానవలక్షణాలకు
వశమైనవాడు తాను శాంతిగా ఉండలేడు, యితరుల
నుండనీయడు, లోకాన్నికూడా ప్రశాంతిగా బ్రతకనీయడు.
అట్టిదుర్జనులకు 'అనార్యవృత్తమప్రాజ్ఞమసూయక
మధార్మికమ్। అనర్థాః క్షిప్రమాయాంతి వాగ్దుష్టం
క్రోధనం తథా॥' (వి. నీ. 6.35) అసత్ప్రవర్తన,
బుద్ధిహీనత, అసూయ, అధర్మపరత్వం, నోటి
దుడుకుతనం, కోపము మున్నగు అనర్థములు
తొందరలో వస్తాయి. 'పరాపవాదనిరతాః పరదుఃఖో

దయేమ చ। పరస్పరవిరోధే చ యతంతే సతతోత్థితాః॥'
(వి. నీ. 7.11) పరదూషణ చేయటం, పరులకు దుఃఖం కలిగించటం, పరస్పరవిరోధాన్ని కల్పించటం మున్నగువాటికై ప్రయత్నించువారు దుర్జనులు. 'యేవై భేదనశీలాస్తు సకామా నిస్త్రపాః శఠాః। యే పాపా ఇతి విఖ్యాతాః సంవాసే పరిగర్హితాః॥' (వి.నీ. 7.13) భేదాభిప్రాయముల కలిగించువారు, కామప్రవృత్తికలవారు, ఎగ్గుసిగ్గులు లేనివారు, మూర్ఖులును అయిన పాపాత్ముల సహవాసం త్యజించాలి. 'సదోషం దర్శనం యేషాం' (వి.నీ. 7.12) వారిని దర్శించటంకూడా దోషమే. అందువలననే 'స్వగృహే పూజ్యతే మూర్ఖః' తన గృహంలో మూర్ఖుడు పూజింప బడతాడని విజ్ఞులు చెప్పారు. 'సర్వస్యౌషధమస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్॥' అన్నింటికి ఔషధములున్నవి కాని మూర్ఖునికిమాత్రం శాస్త్రంలో మందు చెప్పబడలేదని భర్తృహరి వాక్యం. కాని 'గతిరాత్మవతాం సంతః సంత ఏవ సతాం గతిః। అసతాం చ గతిః సంతః న త్వసంతః సతాం గతిః॥' (వి.నీ. 2.46) ఆత్మవంతులకును సజ్జనులే గతి సత్పురుషులకును సజ్జనులే గతి. మరియు దుర్జనులకును సజ్జనులే గతి యగుచున్నారు. కాని సత్పురుషులకు దుర్జనులేనాడును గతికాజాలరని విదురుడు నొక్కి వక్కాణించియున్నాడు. ఇది ముమ్మాటికి సత్యము.

ఇందలి పరమ సత్యమును నేటివారు అనగా దేశాభివృద్ధిని కాంక్షించువారు, దేశోద్ధారకులు,

దేశపాలకులు, దేశరక్షకులు మొదలగువారు గ్రహించి, ఆచరించినచో మనదేశం స్వర్గతుల్యం అవుతుందనడంలో సందేహంలేదు. పుణ్యాత్ములలోని పుణ్యం అగ్నివలె ప్రకాశించి పాపాన్ని నశింపచేస్తుంది. ఈ పనికి దీక్ష, పట్టుదల, శ్రద్ధలు అత్యవసరం. అనవసరపు కార్యాలకు శారీరక, మానసిక శక్తులను వ్యర్థము గావింపక, అందరి శారీరక శక్తులు ఏకమై దేశరక్షణకు, ఎల్లరి మానసిక శక్తులు ఏకమై మానవ సుఖసంపదల అభివృద్ధికి, అందరి హృదయ శక్తులు ఏకమై ధర్మాచరణ ఐకమత్యములకు ఉపయుక్తమైనచో మన భారతదేశము మరల తన పూర్వౌన్నత్యము నందుకుని, ఆధ్యాత్మిక గురుపీఠాన్నలంకరించి, ఆధ్యాత్మికజ్ఞానభిక్షను మాత్రమేకాక భౌతికాభౌతికశక్తులతో విజృంభించి, సర్వమానవాళికి ఆదర్శం కాగలదు. దానికై మానవులొక్కటై మనెదరుగాక! సంక్షుభితలోకము ప్రశాంతి నొందునుగాక!

ఈ విషయమున తన బాధ్యతయేగాక, ప్రపంచ క్షేమ బాధ్యతల స్వీకరించువారు వైరాగ్య సంపన్నులైన యతివరేణ్యులు. మన భారతదేశపు పారమార్థికసంపదల మునిగియు, శాస్త్రజ్ఞానమును గ్రహించి, సంచార గ్రంథాలయాలవలె దేశదేశముల దిరిగి, ప్రబోధించు నా సన్యాసులకగ్రస్థానము ప్రపంచమున ఉన్నదిగదా! ప్రపంచ నిత్యానిత్యముల గ్రహించి, అనిత్యప్రపంచాన్ని సృజించిన సృష్టికర్తయొక్క నిత్యత్వము నందుకొనుటకు యత్నించువాడు సన్న్యాసి. భగవద్విశ్వాసముతో,

భగవదారాధనారతుడై, పరంవైరాగ్యాశ్రితుడై, లౌకిక విషయవిదూరుడైనవాడు సన్న్యాసి. శమదమాది గుణసంశోభితుడై, జపతపసాధనాదులచే బ్రహ్మజ్ఞానమును సాధించువాడు సన్న్యాసి. బ్రహ్మజ్ఞానముతో ప్రకాశించిన బ్రహ్మవిదుడే సన్న్యాసి. స్వచ్ఛమైన నదీజలములు భూమిపై ప్రవహించి, భూమిని సస్యశ్యామలం చేసి, మానవులకు శారీరక పోషణకై చక్కని పంటను పండించునట్లుగా పరమహంస పరివ్రాజకాచార్యులైన సన్న్యాసులును, తమ హృదయ జనిత నిర్మల జ్ఞానప్రవాహమును, సాధక హృదయ క్షేత్రముల ప్రవహింపజేసి, జననమరణ రహితమైన మోక్షమను పంటను పండింపజేయాలి. ఇది వారి బాధ్యతయేకదా! అందుచేతనే 'గత పారం తపస్వినం' (వి. నీ. 3.70) తత్త్వమును పొందినవాడు తపస్వి అనియు, ఆ తాపసులకు 'తపోబలం తాపసానాం బ్రహ్మ బ్రహ్మవిదాం బలం' (వి. నీ. 7.69) తపస్సు బలమనియు, బ్రహ్మవిదులకు బ్రహ్మజ్ఞానమే బలమనియు, 'అరోషణో యః సమలోష్టాశ్మకాంచనః ప్రహీణశోకో గతసంధివిగ్రహః। నిందాప్రశంసోపరతః ప్రియాప్రియే త్యజన్నుదాసీనవదేష భిక్షుకః॥' (వి. నీ. 6.6) రోషరహితుడు, బంగారమును మట్టిని రాయిని సమబుద్ధితో వీక్షించువాడు, దుఃఖరహితుడు, స్నేహవిరోధభావములు లేనివాడు, దూషణ భూషణ ములనతీతించువాడు, అనగా 'తుల్యనిందాస్తుతిః' అను గీతావాక్యమురీతి నిందాస్తుతులను సమరీతి భావించువాడు, ప్రియాప్రియములను త్యజించిన

వాడు, ఉదాసీనమున నుండువాడు యత్యాశ్రమి అనియు విదురనీతి నిర్వచనం. బ్రహ్మచారికి వేదాధ్యయన గురుశుశ్రూషలు; గృహస్థులకు మాతాపితృసేవ, భగవదారాధన, దానధర్మములు; వానప్రస్థుకు అరణ్యవానము, జపతపాదికములు; సన్న్యాసులకు ఉత్కృష్ట వైరాగ్య , బ్రహ్మ జ్ఞానములును అత్యంతావశ్యకములు. వారి వారి స్థానముల వారున్నచో వారిని, ప్రపంచము భక్తి ప్రపత్తులతో, గౌరవాదరాభిమానములతో చూచును. వారు రాజకీయములకు, తమ వైరాగ్య స్థితుల కాటంకదాయక విషయములకు దూరముగా నుండవలయును.

ఇంతవరకు మానవ జీవితప్రణాళికలో మూఢుడిగా, దుర్జనుడిగా, సజ్జనుడిగా, సన్న్యాసిగా, మహాత్ముడిగా, పండితుడిగా, మహారాజుగా, మంత్రిగా, సేవకుడిగా పరిణమించిన ఆ యా మనస్తత్వములు గల మానవాళికి, వారి వారి స్థానములకు ఉచితమైన ఉపదేశములను అనేకంగా చేసిన మహాత్ముడైన విదురుడు అంతతో నాగక, సామాన్య ప్రజలనుకూడ దృష్టిలో నుంచుకొని, వారు పాటింపవలసిన కొన్ని నియమాలను, వదలవలసిన కొన్ని లక్షణాలనుకూడా బోధించి, లోకశాంతికి కారకుడు, మార్గదర్శి అయ్యాడు.

'అనృతే చ సముత్కర్షో రాజగామి చ పైశునమ్। గురోశ్చాలీకనిర్బంధః సమాని బ్రహ్మ హత్యయా ॥' (వి.నీ. 8.3) అసత్యమునందలి విజయము, రాజధనమునందలి లోభము, గురువును

నిర్బంధించుట అను మూడును బ్రహ్మహత్యతో సమానములు. 'అనూయైకపదం మృత్యుః అతివాదః శ్రియో వధః' (వి.నీ. 8.4) అసూయ మృత్యువు,. అధికప్రసంగము సంపదను నశింపజేస్తుంది. అంతేకాక 'అనాహూతః ప్రవిశతి అపృష్టో బహుభాషతే' (వి.నీ.1.36) పిలువకున్నను కల్పించుకుని వచ్చుట, అడుగకపోయినా అతిగా మాట్లాడటంవంటివి దుర్గుణాలు. ఈ చెడులక్షణాలను మానవులు వదిలితే సుఖశాంతులు కరతలామలకం అవుతాయని అర్థం.

ఇక సామాన్యమానవులుకూడా నిత్య జీవితంలో తెలిసీతెలియక అనేకబాధల నను భవిస్తుంటారు. మంచిచెడ్డల గ్రహించి, మంచిని ఆచరించినచో సుఖసంతోషాలు లభిస్తాయి. దానికొరకు కొన్ని నియమాలను పాటింపక తప్పదు. 'ఏకః స్వాదు న భుంజీత ఏకశ్చార్థాన్న చింతయేత్। ఏకో న గచ్ఛేదధ్వానం నైకః సుప్తేషు జాగృయాత్ ॥' (వి. నీ. 1.46) రుచియైన పదార్థాన్ని ఒక్కడే భుజించరాదు - అనగా చక్కని రుచిగల పదార్థాన్ని ఒక్కడే తినటం అనేది జిహ్వాచాపల్యాన్ని సూచిస్తుంది. అందుచేత తనకు ప్రియమైన వస్తువును పరులకు యిచ్చిన, త్యాగగుణం అభివృద్ధియై, అవతలివారికి వీరిపై ఒక సదభిప్రాయం ఏర్పడుతుంది. పరస్పరసహాయం చేసుకొనే అవకాశం కలుగుతుంది. జిహ్వేంద్రియ నిగ్రహంకూడా కలుగుతుంది. ఒక్కడే కొన్ని విషయాలనుగూర్చి ఆలోచించ కూడదు - గృహం కొనటంలో లేక అమ్మటంలో,

వివాహవిషయంలో, అప్పులివ్వటంలో ఒక్కడే చేయక, నలుగురితో ఆలోచించి చేసుకొనటం మంచిది. దీనివల్ల పరస్పర అవగాహన ఏర్పడు తుంది. అనేకరకాల తత్త్వాలు బాగా తెలుస్తాయి. మంచి స్నేహితులుకూడా ఏర్పడుతారు. ఒక్కడే ప్రయాణం చేయరాదు - ఏ ఆపద కలిగినా ఒకరికొకరు సహాయాన్నందించుకోవచ్చును నలుగురుకలిసి ప్రయాణం చేస్తే. దీనివల్ల ఉపకారం చేసేవారు, అపకారం చేసేవారు, నమ్మకస్థులు, స్నేహితులు అనేవారిని యీ సమయాలలోనే గ్రహించుకోవచ్చును. ఒకరికష్టసుఖాలకు మరొకరు చేయూతనిస్తారు. అందరు నిద్రించు సమయమున ఒక్కడే మేల్కొని ఉండకూడదు - ఇది చాల అపాయకరం. క్రొత్త ఊరికి వెళ్లి, క్రొత్త వ్యక్తుల గృహంలో యీ నియమాన్ని తప్పక పాటించాలి. క్రొత్తచోట ఒక్కడు మేల్కొనిఉంటే ఆ యింటివారికి వీడిపై అనేక అనుమానాలు ఏర్పడతాయి. అందుచేత నలుగురితోపాటు కలిసి నిద్రించాలని అర్థం.

'సత్యేన రక్ష్యతే ధర్మః విద్యా యోగేన రక్ష్యతే। మృజయా రక్ష్యతే రూపం కులం వృత్తేన రక్ష్యతే॥ ' (వి.నీ.2.39) ధర్మం సత్యంచేత రక్షింపబడుతుంది. అనగా సత్యరక్షితమైన ధర్మం వాక్కుచేత సత్యాన్ని పలికించి, వాక్కుకు మంచి శక్తిని, పుష్టిని కలిగిస్తుంది. మరియు 'వాణ్యేకా సమలంకరోతి పురుషం' అనురీతిగా యీ వాక్కు ఒక్కటే మానవునికి అలంకారమవుతుంది. విద్య

అభ్యానంచేత రక్షింపబడుతుంది - విద్య మనస్సుకు వివేకవికాసాలను కలిగిస్తుంది. అరగదీస్తున్న గంధపుచెక్క చక్కని సువాసనను వెదజల్లినట్లు అభ్యాససహితమైన విద్యకూడ కీర్తిప్రఖ్యాతులను దశదిశలకు విస్తరింపజేస్తుంది. అందుచేతనే 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' విద్యాలంకృతుడైన విద్వాంసుడు సర్వత్ర పూజింపబడతాడని సూక్తి. రూపం నలుగుపెట్టటంచేత రక్షింవబడుతుంది - లౌకికాలౌకిక జీవితాలలో శరీరానికి చాల ప్రాధాన్యత ఉన్నది. దేహం ఆరోగ్యంగా ఉండి పనులు చేస్తుంటే, యింట్లో అన్ని పనులను చేయించుకుంటారు అందరూ. ఆరోగ్యమే సరిలేకపోతే, యింతకాలం వారిచేత పనులను చేయించుకున్నవారుకూడా విసుక్కుంటారు. ఇది లౌకిక జీవితంలోని వ్యక్తుల లక్షణం. కాబట్టి శరీరం ఆరోగ్యంగా వుండాలి. పారమార్థిక జీవితంలోకూడా సక్రమ సాధనాదులు సాగాలంటే సాధకుడికి చక్కని ఆరోగ్యం ఉండాలి. అందుచేతనే ఆ యారోగ్యసంపాదనకు ఆసనాలను సూచించాడు యోగసూత్రకర్తయైన పతంజలి మునివర్యుడు. 'యుక్తాహారవిహారస్య' అను గీతా శ్లోకం సాధకుడికి చాల ముఖ్యం. అంతేకాక, నలుగుపెట్టుకొనటంచేత రక్తప్రసరణ బాగా జరిగి, శరీరం ఆరోగ్యాన్ని, కాంతినికూడా పొందుతుంది. కులం మంచిప్రవర్తనచేత రక్షింవబడుతుంది - ధనం సంపాదించినంతమాత్రంచేత వంశం ఉన్నతిని పొందదు. ధనంవల్ల అహంకారంమాత్రం కలుగుతుంది. ధనంతో అన్నీ సాధించవచ్చును అనుకోటం కూడా పొరపాటే. మాతృప్రేమ, సత్ప్రవర్తన

ధనంతో లభ్యం అయ్యేవికావు లోకంలో ఉన్నత పదవులతో, పాండిత్యాలతో లభించేదికాదు సత్ప్రవర్తన. ధనవంతుని కీర్తిప్రతిష్ఠలు అశాశ్వతం కాని సత్ప్రవర్తనవల్ల సిద్ధించే కీర్తిప్రతిష్ఠలు శాశ్వతం. సజ్జనుల సహవాసంతో మంచి నడవడిక నేర్చుకోవాలి. కాన మానవుడు ప్రాపంచిక, ఆధ్యాత్మిక జీవితవులకు వలసిన శరీరారోగ్యాన్ని కాపాడుకుంటూ, సత్యమైన వాక్కుతో ధర్మాన్ని నిలుపుకుంటూ, మానసికవికాసాన్నిచ్చే విద్యను అభ్యాసంతో రక్షించుకుంటూ, సత్ప్రవర్తనతో తన వంశప్రతిష్ఠను కాపాడుకోవాలనే రహస్యాన్ని యీ ఒక్క శ్లోకంలో యిమిడ్చి చక్కగా బోధించాడు విజ్ఞానియైన విదురుడు. ఎంత చక్కని శ్లోకం!

'దేవతానాం చ సంకల్పం అనుభావం చ ధీమతామ్। వినయం కృతవిద్యానాం వినాశం పాపకర్మణామ్॥ ' (వి.నీ. 1.72) 'చత్వార్యాహ మహారాజ స్యాదస్కాని బృహస్పతిః' (వి.నీ. 1.71) దేవతల సంకల్పం, ధీమంతుల గొప్పదనం, విద్యావంతుల వినయం, పాపకర్మల నాచరించువారి వినాశనమను నీనాలుగును వెంటవెంటనే ఫలితముల నిచ్చునని బృహస్పతి వచనం. సత్యేమేగదా! దేవతల సంకల్పం తిరుగులేనిది. అందుచేత వెంటనే జరుగుతుంది. ధీమంతుల గొప్పదనం వారి మాటలో, చేతలో మనకు వెంటనే గోచరిస్తుంది చూడగానే. విద్యావంతుల వినయం వారి గుణగణాలలో వ్యక్తం అవుతుంది. పాపకర్మల చేయువారికికూడా ఫలితం వెంటనే ఉంటుంది

గ్రహించుకున్నవారికి.

'యది సంతం సేవతి యద్యసంతం తపస్వినం యది వా స్తేనమేవ। వాసో యథా రంగవశం ప్రయాతి తథా సతేషాం వశమభ్యుపైతి॥' (వి.నీ. 4.10) సత్పురుషుడు, దుర్జనుడు, తపస్వి, చోరుడు అను నీ నలుగురు వ్యక్తులతో వసించినవారికి, వస్త్రమునకు రంగు అంటినట్లుగా, ఆ యా వ్యక్తుల లక్షణాలు, ఆ యా వ్యక్తులలో ప్రవేశించి, వారిని అదేవిధంగా తయారు చేస్తాయి. ఇది పరమ సత్యం. సజ్జనుని, తపస్విని ఎంతకాలం సేవించినా ఆ లక్షణాలు సులభంగా పట్టుబడవుకాని దుర్జనుని, దొంగను ఎక్కువకాలం సేవించకపోయినా ఆ లక్షణాలు త్వరగా లోనికి ప్రవేశించి, చాల తొందరలో పతనదశకు తీసుకువస్తాయని గట్టిగా చెప్పవచ్చును. మంచిసంస్కారవంతులకు సత్పురుష తపస్విలక్షణాలు, దుష్టసంస్కారులకు దుర్జన చోరుల గుణములు పట్టుబడవచ్చును. అందుచేతనే సుసంస్కారులకు సత్సహవాసంలో సత్త్వగుణాభి వృద్ధి కలిగి, సల్లక్షణాలన్నీ అలవడి, సత్పురుషులుగా పరిణమిస్తారు. కాని సత్సాంగత్యం లభించటమే కష్టంగదా! ఆ సత్సాంగత్యమైనా జీవన్ముక్తిదాయకం కావాలనే విషయాన్ని 'సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్। నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥' సత్సంగంలో నిస్సంగం వచ్చేవరకు, నిస్సంగంలో నిర్మోహత్వం సిద్ధించేవరకు, ఆ నిర్మోహత్వంలో నిశ్చలత్వం ఏర్పడేవరకు, ఆ నిశ్చలత్వంలో జీవన్ముక్తి అనే స్థితిని అందుకునేవరకు సాధనాదుల గావిస్తూ,

నిస్సంగ, నిర్మోహ, నిశ్చలత్వాలు ఎంతవరకు సాధ్యమైనవో గ్రహించుకుంటూ, జీవన్ముక్తస్థితిలో నిలిచిపోవాలని భజగోవిందంలో శ్రీ శంకరులు ఒక్క శ్లోకంలో చక్కగా బోధించారు. సత్సంగం నుండి జీవన్ముక్తిపర్యంత సాధనాదులను క్రమంలో సూచిస్తూ, ఆ సాధనాఫలితమైన జీవన్ముక్తిని పొందమని ఉపదేశించారు శ్రీ శంకరాచార్యులు. అందుచేతనే సత్పురుష సహవాసం, వారి శుశ్రూష, వారి ఉపదేశములు మోక్షదాయకములై ఉంటాయి. అదేవిధంగా దుర్జనుల సాంగత్యంలో దుర్గుణాలన్నీ అభివృద్ధి చెంది, రజోగుణం పెరిగి లోకకంటకులు అవుతారు. మంచివారివల్ల శాంతి, చెడ్డవారివల్ల అశాంతి అనువిషయం ఎల్లరకు విదితమే. అందుచేతనే 'పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః। న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః॥' మానవులు పుణ్యఫలితాన్ని కోరుకుంటారుగాని పుణ్యం చేయటానికి యిష్టపడరని, పాపఫలితాన్ని వాంఛింపరుగాని ప్రయత్నపూర్వకంగా పాపాన్ని చేస్తారను యథార్థ విషయం యీ శ్లోకం చక్కగా బహిర్గతం చేసింది. కాబట్టి స్నేహం చేసేటప్పుడు చాల జాగ్రత్తలు అవసరం.

ఒక బోయవాడు రెండు చిలుకపిల్లలను పట్టుకునివచ్చి, ఒక ఊరిలో ఆ రెండింటిని వేరువేరు మనుష్యులకు అమ్మివేశాడు. ఒక చిలుకపిల్లను కొన్నవాడు నిత్యం దేవతార్చనన చేస్తూ, రామనామస్మరణ చేసుకుంటూ, అతిథి అభ్యాగతుల

నాదరిస్తూ, ప్రశాంతమైన జీవితం గడుపుతున్న మంచిగృహస్థు. తనయింటికి వచ్చిన పుణ్యాత్ములను ఆదరించి 'రండి! కూర్చోండి! భోజనంచేసి వెళ్లండి!' అంటూ మర్యాదజేసి భోజనం పెట్టి పంపేవాడు. అందువలన ఆయన పెంచిన చిలుకకూడ పంజరంలో నుండి, వచ్చినవారిని చూచి, 'రండిరండి! కూర్చోండి! భోజనం చేసి వెళ్లండి! అనే మాటలను స్పష్టంగా పలుకుతూ ఉంటే, అతిథులు విని ఎంతో ఆనందించేవారు. ఇక రెండవ చిలుకపిల్లను కొన్నవాడు మేకలను, గొర్రెలను, పశువులను చంపే కసాయివాడు కావటంచేత, వచ్చినవారిని చూచి, దగ్గరికి పిలిచి 'రండి! కూర్చోండి! యీ మేకలను యిప్పుడే చంపుతాను. ఆ పశువులనుకూడా యిప్పుడే కోస్తాను' అని సంభాషణ ప్రారంభించేవాడు. అందువలన ఆ కసాయివాడు పెంచిన చిలుకకూడ వచ్చినవారిని చూచి, 'రండి! రండి! కూర్చోండి. చంపుతాను, కోస్తాను' అని పలుకుతుంటే కొత్తవారు భయంతో పరుగులు వేసేవారు. మనస్సు ఎదగక, విచక్షణాజ్ఞానంలేని పక్షులకు ఆ మార్పు సహజమేమో! కాని Man is a rational animal అని ప్రఖ్యాత గ్రీకుతత్త్వవేత్తయైన ఆరిస్టోటల్ (Aristotle) వచించినట్లు మానవుడు బుద్ధి నుపయోగించు జంతువుకదా! మరి విచక్షణాజ్ఞానం ఏమవుతుంది? తప్పని తెలిసికూడా చేయటమే మానవలక్షణమా? కాన మానవుని ఔన్నత్యానికి, పతనానికికూడా సత్సంగమహిమ, దుస్సాంగత్యదోషం కారణం అనక తప్పదు.

తపస్విని ఆశ్రయించినవాడు తపస్సు చేస్తాడు. తపస్సువల్ల మనస్సు స్వాధీనం అవుతుంది. స్వాధీనమనస్కునికి ఇంద్రియజయం కలుగుతుంది. తపస్సువల్ల ఏకాగ్రత సిద్ధిస్తుంది. ఆ ఏకాగ్రత ధ్యాననిమగ్నతను కలుగచేస్తుంది. ఆ ధ్యానమే సత్సమాధిసంస్థితుల నందిస్తుంది. మనస్సును భగవంతునికై తపింపజేయటం తపస్సు అని నిర్వచనం చేసుకొనవచ్చును. ఆ తపస్సువల్ల మహర్షులు లోకారాధ్యులయ్యారు.

ఇక దొంగసేవవల్ల దొంగ లక్షణాలే అలవడతాయి కాని సల్లక్షణాలు ఏవిధంగా వస్తాయి? త్రాగినవాడికి మంచిమాటలు వస్తాయా? మంచిబుద్ధులు, సంస్కారాలుగా మారి జన్మజన్మలకు పరంపరగా వచ్చినట్లు, దుష్ట బుద్ధులుకూడా సంస్కారములుగా పరిణమించి, జన్మజన్మలకు వస్తుంటాయి. మంచి, మంచి ఫలితాలను, చెడు, చెడు ఫలితాలను యిస్తూనే ఉంటాయి. ఈ మంచి చెడులు రెండూకూడ ప్రవాహములే! ఏ ప్రవాహంలో చేరుతాడనేది వాడి వాడి సంస్కారాలమీదనే ఆధారమనిగదా అన్వయం. ఒకరింట్లో పిల్లవాడు పుట్టాడు. అందరూ పొంగిపోయారు. అది సహజమేకదా! అబ్బాయి పుట్టితే ఆనందం, అమ్మాయి పుట్టితే బాధ. నేడు అందరూ అబ్బాయిలనే కోరుకుంటున్నారు. మరి అందరికీ అబ్బాయిలే అయితే, కోడళ్లు ఎక్కడనుండి వస్తారో! సరే! అబ్బాయి మంచి ఆరోగ్యంగా పుట్టాడన్నాడు వైద్యుడు. పిల్లవాడి ఎడమచెయ్యి తెరిచి ఉన్నదికాని కుడిచెయ్యిమాత్రం మూసి

ఉన్నది. వైద్యుడు ఆ చేతి వ్రేళ్లను తీయటానికి ప్రయత్నిస్తుండగా పిల్లవాడు బిగ్గరగా ఏడవటం ప్రారంభించాడు. అందరూ చుట్టూ చేరారు. మొత్తానికి వ్రేళ్లను బలవంతంగా విప్పారు. ఆ చేతిలో ఉంగరం ఉన్నది. ఆ ఉంగరాన్ని చూస్తూనే మంత్రసాని తన చేతిని చూచుకుంది. వ్రేలుకున్న ఉంగరం లేదు. 'ఆ ఉంగరం నాదే' అంటూ ఆ ఉంగరాన్ని తీసుకుంది. 'నేను సంపాదించుకున్న ఉంగరం పోయిందే' అని గుక్కపట్టి ఏడుస్తున్నాడు పిల్లవాడు. ఈ కథలోని సారాంశం దొంగ సంస్కారాలు బలీయంగా ఉండటం. ఆ విధంగా పసితనంనుండే దొంగలక్షణాలుండి, దొంగగా మారటంలో ఆశ్చర్యంలేదు. అట్టి చోరుని సాంగత్యంలో చోరగుణాలుకాక మంచి లక్షణాలు రావుగదా! అందుచేతనే 'యాదృశైః సంనివిశతే యాదృశాంశ్చోపసేవతే। యాదృగిచ్ఛేచ్చ భవితుం తాదృగ్భవతి పూరుషః॥' (వి. నీ. 4.13) ఎటువంటివారితో స్నేహము గావించునో,ఎటువంటి వారిని సేవించునో, ఎటువంటివాడగుటకు కోరుకొనునో పురుషుడు అటువంటివాడగుననియే విదురనీతి నిర్ణయం.

'సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః। అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః॥' (వి.నీ. 5.15) తాత్కాలికముగా ప్రియమును వచించువారు సులభముగా లభిస్తారు. కాని యిష్టము లేకున్నను హితము నుపదేశించువాడును, వినువాడును దొరుకుట దుర్లభం. నిజమేగదా!

తాత్కాలిక సుఖాన్వేషకులు తమ కార్యముల నెరవేర్చుకునేందుకు, పేరుప్రతిష్ఠలకోసం తాపత్రయం చెందుతున్నవారిని ఆశ్రయించి, వారిని పొగిడి, మంచి చేసుకుంటారు. తమ పనులు పూర్తి అయినతర్వాత మరల వారు కంటికి కనిపించరు. మానవులలో గల కొన్ని బలహీనతల గ్రహించి, వాటిని వినియోగించుకుని పైకివస్తారు కొంతమంది వ్యక్తులు. మానవుల ఆశ ఆ విధంగా ఉంది, అటువంటివారిని విశ్వసిస్తారు. ఉన్న యథార్థాన్ని తెలిపి, మంచిని చెప్పితే, ఎవరూ వినకపోగా చెప్పినవారిని అనుమానిస్తారు. అయినా లోకులు వంచకులను నమ్మినట్లు మంచివారిని నమ్మలేరు గదా! అందుచేతనే మంచిని చెప్పేవారు, వినేవారుకూడ అరుదుగా ఉంటారు లోకంలో.

'మార్దవం సర్వభూతానామనసూయా క్షమా ధృతిః। ఆయుష్యాణి బుధాః ప్రాహుర్మిత్రాణాం చావిమాననా॥' (వి.నీ. 7.52) సమస్త భూతముల యందు మృదుభావన, అసూయారాహిత్యం, సహనం, ధైర్యం, స్నేహితుల నగౌరవపరచకుండటం, అను నీ లక్షణములు ఆయువును పెంపొందించునని చెప్పుచున్నారు. 'ఈర్షుః ఘృణీ న సంతుష్టః క్రోధనో నిత్యశంకితః। పరభాగ్యోపజీవీ చ షడేతే నిత్యదుఃఖితాః॥' (వి.నీ. 1.90) ఈర్ష్య, దీనత్వం, అసంతృప్తి, క్రోధం, అనుమానం, పరధనంతో జీవించటం అను లక్షణములు సదా దుఃఖమును కలిగించుచున్నవి. 'సంతాపాత్ భ్రశ్యతే రూపం సంతాపాత్ భ్రశ్యతే

బలమ్ ! సంతాపాత్ భ్రశ్యతే జ్ఞానం సంతాపాత్ వ్యాధిమృచ్ఛతి॥ ' (వి.నీ. 4.44) శోకముచేత రూపం, బలం, జ్ఞానం నశించుచున్నవి. మరియు సంతాపమువలననే వ్యాధి వస్తుంది. అందుచేతనే 'సుఖం చ దుఃఖం చ భవాభవౌ చ లాభాలాభో మరణం జీవితం చ। పర్యాయశః సర్వమేతే స్పృశంతి తస్మాద్ధీరో న చ హృష్యేన్న శోచేత్॥ ' (వి. నీ. 4.47) సుఖదుఃఖములు, భవాభవములు, లాభాలాభములు, జీవితమరణములు అందరిని వరుసగా స్పృశించు చున్నవి. కాని ధీరునికి యీ విషయములు ఆనందమునుగాని, దుఃఖమునుగాని కలిగింపవు అని అనేకధర్మముల మానవాళికి తెలియజేసి ధన్యుడయ్యాడు మహాత్ముడైన విదురుడు.

విదురుడు ఒక్క ధృతరాష్ట్రునికేగాక, కౌరవులకు, పాండవులకుకూడ అనేక ధర్మ విషయాలను ఉపదేశించాడు. మరియు ధృతరాష్ట్రునికిమాత్రం ప్రత్యేకంగా, పాండవులతో విరోధం తగదని అనేకపర్యాయాలు తెలిపాడు. అయినా ధృతరాష్ట్రుడు వినలేదు. 'మహారాజా! నీవు కురువంశజ్యేష్ఠుడవు. పాండవులు, నీవు పెద్దవాడవని గౌరవాన్ని చూపిస్తున్నారు. ఈ విషయం మరువవద్దు. వారు ధర్మమార్గానువర్తులు. వారిని నీవు అధర్మగామివై బాధిస్తున్నావు. నీపుత్రులందరు దుష్టులు. 'ఉక్తం మయా జాత మాత్రేఽపి రాజన్ దుర్యోధనం త్యజ పుత్ర త్వమేకమ్। తస్య త్యాగాత్ పుత్ర శతస్య వృద్ధిః అస్యాత్యాగాత్

పుత్రశతస్య నాశః॥' (వి.నీ.7.5) రాజా! దుర్యోధనుడు జన్మించినప్పుడే వీనిని వదలమని, ఈ ఒక్కని త్యాగంచేత నూరుగురు పుత్రులకు అభివృద్ధి కలుగుతుందని, లేనిచో పుత్రశతం నశిస్తారని నీకు చెప్పానుకదా! 'వృద్ధేన హి త్వయా కార్యం పుత్రాణాం తాత శాసనమ్। మయా చాపిహితం వాచ్యం విద్ధి మాం త్వద్ధితైషిణమ్॥' (వి.నీ. 7.22) నీవు పెద్దవాడవుకాన నీ సంతానాన్ని నీవు అదుపులో పెట్టుకో! నీమేలు కోరిన నేను నీకు హితమునే చెప్పుచున్నాను. 'అతీవ సర్వాన్ పుత్రాంస్తే భాగదేయపురస్కృతః ! తేజసా ప్రజ్ఞయా చైవ యుక్తో ధర్మార్థతత్త్వవిత్॥' (వి.నీ. 2. 85) ధర్మార్థతత్త్వముల గ్రహించినవాడును, ప్రజ్ఞా శౌర్యములు గలవాడును, రాజ్యవిషయమున నీ పుత్రులందరికంటె గౌరవమర్యాదలను సంపాదించిన వాడు ధర్మరాజు. మరియు 'రాజా లక్షణసంపన్నః త్రైలోక్యస్యాపి యో భవేత్। శిష్యస్తే శాసితా సోస్తు ధృతరాష్ట్ర! యుధిష్ఠిరః॥' (వి. నీ. 2.84) ధృతరాష్ట్రమహారాజా! సకల సల్లక్షణోపేతుడు, నీమాటయందు గౌరవమున్నవాడు, ముల్లోకములకు మహారాజు కాగలవాడు యుధిష్ఠిరుడు. అట్టి యోగ్యుడే యీ పృథ్విని పరిపాలించుగాక! కాన 'రాజన్ భూయో బ్రవీమి త్వాం పుత్రేషు సమమాచర। సమతా యది తే రాజన్ స్వేషు పాండుసుతేషు వా॥' (వి.నీ.7.85) రాజా! పాండుసుతులయందును, నీ పుత్రులయందును సమభావము కలిగియుండుము. ఈ విషయమును నీకు మరల మరల చెప్పుచున్నాను అని

ధృతరాష్ట్రునికి పదేపదే భవిష్యద్విషయముల ముందుగనే వివరించాడు విదురుడు. ధృతరాష్ట్రుని విషయం మొదటినుండి చక్కగా గ్రహించినవాడు విదురుడు. 'అనమ్యగుపయుక్తం హి జ్ఞానం సుకుశలైరపి। ఉపలభ్యం చావిదితం విదితం చాననుష్ఠితమ్॥' (వి.నీ.7.34) మంచి కుశలత్వము గలవారిచే నుపదేశింపబడిన జ్ఞానముకూడ ఒక్కొక్క సమయమున నిష్ప్రయోజనమగును. బోధింపబడిన జ్ఞానం తెలియదు. ఒకవేళ తెలిసినా ఆచరించడు అని చాల చక్కగా వివరించాడు. అందుచేతనే, 'లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి' గ్రుడ్డివానివిషయమున అద్దము ఏమియు చేయజాలదను సూక్తి పరమ సత్యము. తెలివితేటలు వేరు, ఆచరణ వేరు. ధృతరాష్ట్రుని విషయంలో విదురుడు ఏమాత్రం బాధనొందక, అది తన బాధ్యతగా భావించి, హితోపదేశం చేశాడు. ఏ నాటికైనా అజ్ఞాని అజ్ఞానియేనా? విజ్ఞాని విజ్ఞానియేనా?

భారతం చదువనివారు సాధారణంగా ఉండరనే చెప్పాలి. ఉపన్యాసములద్వారా, రేడియో ప్రసంగములద్వారా చాలామంది వినేఉంటారు. ఇటీవల మహాభారతాన్ని టెలివిజన్‌ద్వారా చూచే ఉంటారు. వారివారి గుణాలననుసరించి శ్రీ వ్యాసమునిచంద్రుని, భీష్మాచార్యుని, విదురుని, పాండవులను యిష్టపడేవారు కొంతమంది ఉండగా, మరికొంతమంది ధృతరాష్ట్రుని, కౌరవులను, శకునిని యిష్టపడేవారు ఉంటారు. అదేవిధంగా రామాయణంలో

శ్రీరామచంద్రుని మెచ్చుకునేవారు కొందరు, రావణాసురుని యిష్టపడేవారు కొందరుంటారు. మరి కైకమ్మపక్షంలో చేరేవారుకూడా ఉంటారనడంలో సందేహంలేదు. అందుకే 'యద్భావం తద్భవతి' అన్నారు. కాని ధర్మపక్షంలో కొంతమంది, అధర్మ పక్షంలో కొంతమంది చేరక తప్పదుగదా! వారివారి భావనలుకూడా అదేవిధంగా ప్రవర్తిస్తుంటాయి.

ఇక యీ 'విదురనీతి' గ్రంథాన్ని ప్రశంసించినా, విదురుని హితోపదేశాలు బాగున్నవని మెచ్చుకున్నా, విదురుని ధర్మవివరణ చాలా బాగున్నదని అనుకున్నా మానవులలో మార్పు రానేరదు. ఆచరణతోనే మార్పు రావాలి. మాటలు, ప్రసంగాలతోనే మార్పు వస్తే, నీతినియమాలు, ధర్మాధర్మములనుగూర్చి ఉపన్యసించేవారు లోకంలో అనేకమంది గోచరిస్తారు. మాటలు చేతలలోకి రావాలి. కాన మానవత్వము కలిగిన ప్రతివ్యక్తి 'విదురనీతి'ని పఠించి, ఆచరించి, శాంత్యానందముల పొందవలయును. అట్టి ఆనందానుభూతికై సర్వమానవాళి కృషి సలుపుదురుగాక! ఆ కృషికి భగవంతుడు దోహదము చేయుగాక!

ఓం అసతో మా సద్గమయ!

ఓం తమసో మా జ్యోతిర్గమయ!!

ఓం మృత్యోర్మా అమృతం గమయ!!!

ఓం హరిః ఓం తత్ సత్